

"జేమ్స్‌బాండ్ 777"లో విజయశ్రీ

mcm/cet/74 Tel

# టాప్ రహస్యము!



క్రొత్త బినాకా టాప్‌లో మాత్రమే ఒక రహస్యమైన పదార్థము ఉంది కనుక యీ టూత్ పేస్టు మీ నోటిలో అన్ని మూలలకు, పళ్ల మధ్య చిన్న చిన్న సందులలోనికి చొచ్చుకొని పోయి, ఆ చోట్లలో ఉన్న సూక్ష్మ క్రిములను నాశనము చేస్తుంది. అందుకనే మీ నోరు రోజంతా సంపూర్ణముగా శుభ్రముగా, పూర్తిగా తాజాగా ఉంటుంది, అలా మీ నోటి ఆరోగ్యమునకు సంపూర్ణ రక్షణ కలుగుతుంది!

C I B A Cosmetics

ఈ నిదర్శనమును మీరు చూడగలరు! పరిశోధనాగారములో జరిగే యీ పరీక్షను నేడే మీ యింట్లో చేసి చూడండి.



ఒక గాజు గిన్నెను తీసుకొని దానిలో నీరు పోయండి. బొగ్గు గుండను లేక రంగు పొడరును నీటి మీద చల్లండి.



బినాకా టాప్‌ను కొంచెము నీళ్లలో కలపండి. ఆ ద్రావకము ఒక చుక్కను గాజు గిన్నె మధ్యలో వేయండి.



బినాకా టాప్ ఎంత త్వరగా అన్ని వైపులకు చేరి మలినమును పోగొట్టి, ఉపరితలమును స్వచ్ఛముగా, తేటగా చేస్తుందో మీరే చూడండి.

## బినాకా టాప్

...సంపూర్ణ నోటి రక్షణ యొక్క రహస్యము



## దీపావళి సంచిక

మీరు అభిమానించిన ఆరుకథలూ కొన్ని దీపావళి మతాబాల్లా బాగ కాలాలేదు. పటాసుల్లా పేల లేదు. అవి కథలు కావు. కథల పేరుతో వ్యథలు. సాహిత్యప్రియులకి వ్యథల.

సర్వేశ్వర్. ( విజయనగరం )

## రాజధాని కబురు

15—10—71 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఉత్తరాలు శీర్షికలో శ్రీ ప్రసాదరావుగారు వ్రాసిన 'ఆలస్యం అమృతం విషం?' అనుశీర్షిక చూసితిని. మొదటనుంచి ఆంధ్రరాష్ట్రము గురించి ఆంధ్రప్రదేశ్ వచ్చిన తరువాత జరిగిన విషయములు. శ్రీ బ్రహ్మానందరెడ్డిగారి గురించి వ్రాసిన విషయములు యధార్థములు. ఆంధ్రరాష్ట్రము ఏర్పడి కొత్తరాజధాని గుంటూరుజిల్లా అమరావతి కొత్తరాజధానిగా నిర్మాణముజరిగి మొదటి ప్రధానమంత్రిగా బ్రహ్మానందరెడ్డిగారు వచ్చిన రోజున ఆంధ్రరాష్ట్రము రాయలసీమతో సహా మహాఅభివృద్ధిగా ఉండాలని నా కోరిక. అమరావతి రాజధాని అనే మాట నా కోరిక మాత్రమే.

పాలేటి వెంకటేశ్వరరావు. ( ఏలూరు )

## సినిమా

ఉత్తమ తెలుగు చిత్రాలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నంది ఎవార్డులు బహూకరించే పథకం ఆ మధ్య కొన్ని అనిశ్చిత పరిస్థితుల మధ్య ఆగిపోవడం, తిరిగి యిటీవల పునరుద్ధరింపబడటం ఎంతయినా ఆనందించదగ్గ విషయం.

యిది కీ. శే. టంగుటూరి ప్రకాశం పంతులుగారి శతజయంతి సంవత్సరం. ఆంధ్రదేశ చరిత్రలో పంతులుగారి ప్రముఖపాత్ర, నిస్వార్థ దేశభక్తి, స్వచ్ఛమైన రాజకీయ నీతిజ్ఞత ఆబాలగోపాలము ఎరిగినదే. ఆ మహాయుని పవిత్ర స్మృతిచిహ్నంగా, ఏటేటా ప్రకటిస్తున్న ప్రథమ, ద్వితీయ,తృతీయ, బహుమతులేగాక, 1971 వ సం. మునకు సంబంధించి నిర్ణయించబోయే ఉత్తమ చిత్రాలకు మాత్రం ఆంధ్రకేసరి పేరిట ఒక ప్రత్యేక బహుమతిని ఏర్పరచడం ఎంతయినా సముచితం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారీ విషయంలో ఆమోదకరమైన నిర్ణయాన్ని వీలయినంత త్వరలో గైకొనవలసినదిగా మేము మిక్కిలి కోరుతున్నాము.

న్. వి. ఎస్. చలపతి, కార్యదర్శి, గుంటూరు ఫిల్మ్‌జర్నలిస్ట్ అసోసియేషన్, (గుంటూరు)

## తెలుగు—కన్నడం ఏకలిపి

ఇటీవల కొందరు పెద్దలు కలిసి తెలుగు—కన్నడ భాషలకు ఏకలిపి ఉండాలంటూ తీర్మానాలు చేసి ప్రభుత్వపరంగా నడుములు బిగించటం అస్మదాదులకు ఆశ్చర్యం కలిగించింది. ఈ విషయమై చర్చించటానికి యీమధ్య హైదరాబాదు, బెంగుళూరు నగరాల్లో జరిగిన సభలకు బ్రహ్మానందరెడ్డి నరసింహారావుగారలు అధ్యక్ష్యం వహించిన విషయం ఆంధ్ర సోదరులకందరికీ తెలిసినదే. దీనినిబట్టి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యీ ఏకలిపి (!) ప్రపోజలుకు సుముఖంగా వున్నట్లు విశదమవుతోందికదా! అయితే నాకొక సందేహం— తెలుగు—కన్నడ భాషలకు అక్షరసామ్యం వున్నంత మాత్రాన ఏకలిపి వుండి తీరాలా? ఈ ప్రపోజల్‌కి ఎంతమంది ఆంధ్రులు సుముఖంగా వున్నారు? నాకుతెలిసినంతవరకు కన్నడిగులలో ఒక్కరూ యీ ఏకలిపికి సుముఖత వెల్లడించలేదు. ఈ లిపి సంస్కరణల వల్ల ఎన్నో అవాంఛనీయ పరిస్థితులు తలఎత్తవచ్చు. మనలోమన మాట—మనకున్న సమస్యలు చాలకనా యీకొత్తగొడవ?

—వి. యస్. చక్రవర్తి (మైసూరు) ●




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 12—11—'71
(శ్రీ విరోధికృన్నామ సం॥ కార్తీకమాసం ౨౫ ౹౹౹౹)

సంపుటము : 65 సంచిక : 12

స్థాపితము
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1

విడి ప్రతి వెల 40 పైసలు

స్వదేశ :

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం . :
హిందీ నటి శీనాచందావర్కార్

విత్తనాలు చల్లుతున్నాను
మంచి పంట
పండుతుందనే
నా ఆశ

బంగ్లాదేశ్ - నిజానిజాలు

పాశ్చాత్య రాజనీతి - రాతి నేల

ఇతనింత పొడుగు ఎలా పెరిగాడబ్బా!

చవాన్

కల్మష వాయువులు

రాజకీయ పక్షాల పోటీ

ఉత్తుత్తి నినాదాలు

జలు

ఇప్పుడు నిన్ను మింగడానికి ఆట్టే కాలం పట్టదు!

చైనా

తైవాన్

# పూర్తిగా చేతులు మారుతున్న రాష్ట్ర కాంగ్రెస్ వ్యవస్థ

మంత్రివర్గ నిర్మాణంలో ముఖ్యమంత్రి అవలంబించిన తీరు, జరిగిన జాగు చూచిన తరువాత, మంత్రులు కావలెనుకున్న పలువురిలో ఉత్సాహం అసలకే పూర్తిగా క్షీణించి పోయాయి. చిన్నగా ఉంటుందనుకున్న మంత్రివర్గం కొద్దికొద్దిగా పెరిగి ఇప్పటికి 25 గురు అందులో ప్రవేశించారు. మరో వారం రోజుల తరువాత మరి ముగ్గురు నలుగురిని చేర్చడం కూడా జరిగినా ఆశ్చర్యపడ నవసరం లేదు.

## మంత్రుల పాలనలేకుండా నెలరోజులు !

ఇప్పటికి దాదాపు నెలరోజులుగా మనరాష్ట్రంలో మంత్రుల పాలనంటూ లేదనే చెప్పాలి. ముఖ్యమంత్రి నరసింహారావుగారు కూడా హెచ్చుకాలం ఢిల్లీలోనే గడపవలసి వచ్చింది. ఇంకా మంత్రివర్గ సహాయకుల ఎంపిక పూర్తి కాలేదు. ప్రదేశ్ కాంగ్రెసు సంఘాన్ని కాంగ్రెసు అధ్యక్షుడు రద్దు చేశారు కాని దాని స్థానంలో వేయవలసిన అడ్‌హాక్ కమిటి సభ్యుల ఎంపికను పూర్తి చేయలేదు. అందుకోసం ముఖ్యమంత్రి మళ్ళీ ఢిల్లీ వెళ్లిరావలసిన అవసరముందను కుంటున్నారు. అడ్‌హాక్ కమిటీలో ఎవరెవరు ఉండవలసింది, ఆ కమిటీకి సమావేశకర్త బాధ్యత ఎవరికి అప్పగించవలసింది నిర్ణయం కాకనే అడ్‌హాక్ నియామకం వాయిదా పడింది. ముఖ్యమంత్రి, కాంగ్రెసు అధ్యక్షుడు దామోదరం సంజీవయ్య గార్ల మధ్య ఏకాభిప్రాయం కుదర లేదు. ప్రధాని విదేశ పర్యటన ముగించుకొని తిరిగివచ్చిన అనంతరమే నిర్ణయం తీసుకొనడం జరుగుతుంది.

## రాష్ట్రంలో కొం[illegible] రాజకీయాలు ?

అడ్‌హాక్ కమిటీ నియామకం [illegible] జరిగి తేలినప్పుడు కాని భవిష్యత్తులో [illegible] రాజకీయాలు మన రాష్ట్రంలో ఏవిధంగా [illegible] తెలదు. కొత్త మంత్రుల నియామకంబట్టి చూస్తే ప్రదేశ్ అడ్‌హాక్ కమిటీ స్వరూపం కూడా ఆవిధంగానే ఉండవచ్చును. మంత్రివర్గంలో బ్రహ్మానందరెడ్డి వర్గానికి చెందిన ప్రముఖులె[illegible] లేరు. అడ్‌హాక్ కమిటీలో కూడా ఉండకపోవచ్చును. అడ్‌హాక్ కమిటీ ఏర్పడిన వెంటనే జిల్లా సంఘాలన్నింటి పునర్నిర్మాణం కూడా జరుగుతుంది. అప్పటికి కాని కాంగ్రెసు వ్యవస్థ పూర్తిగా చేతులు మారదు. వచ్చే సంవత్సరాంతంలో జరుగబోయే రాష్ట్ర శాసనసభా ఎన్నికలకు పార్టీ అభ్యర్థుల ఎంపిక విషయంలో కూడా ఈ మార్పు ప్రభావం కనిపించాలి. అసలు ఇప్పుడు జరుగుతున్న మార్పు లిప్పింటి ఉద్దేశమదే.

## అసలు సమస్య !

ఇన్ని మార్పులు జరిగినప్పుడు, బ్రహ్మానందరెడ్డి వర్గం ఎలా వ్యవహరిస్తుందనేది అసలు సమస్య. ఇంతవరకు వారిలో చలనం కలిగినట్లు కనిపించడం లేదు. శాసనసభా ఎన్నికలు జరిగేవరకు కిమ్మనకుండా ఉంటారో, లేక రాజకీయ ప్రాబల్యం కోసం ఏమైనా చేస్తారో రాజకీయవర్గాలు ఢిల్లీలోను రాష్ట్ర రాజధానిలోను గమనిస్తున్నాయి.

## ఎన్నికల తర్వాతే అభ్యున్నతి

మంత్రివర్గ నిర్మాణం దాదాపుపూర్తి కావచ్చింది. అడ్‌హాక్ కమిటీ నియామకం కూడా జరిగిపోతుంది. ఆ తరువాత రాష్ట్ర కాంగ్రెసువాదులంతా పార్టీ టికెట్లకోసం ఎన్నికల్లో విజయంకోసం కృషి ప్రారంభించి నిమగ్నమై ఉంటారు. మంత్రులు కూడా ఈ పనుల్లోనే తమ శక్తి సమర్థతలను వినియోగించవలసి ఉంటుంది. కాగా ఫిబ్రవరిలో ఎన్నికలు జరిగి కొత్త మంత్రివర్గం ఏర్పడిన తరువాత కాని ప్రభుత్వం రాష్ట్ర అభ్యున్నతికి సంబంధించిన సమస్యల గూర్చి ఆలోచనకు పూనుకొనడం జరగదు.

## తప్పని సమస్యలు

ఐతే కొన్ని సమస్యలను నరసింహారావుగారి మంత్రివర్గం పరిష్కరించడానికి పూనుకొనక తప్పదు. ఇందులో ఒకటి ప్రభుత్వపు ఆర్థిక స్థితి. పేరుకొని పోయిన రిజర్వుబ్యాంక్ ఓవర్ డ్రాఫ్టులను చెల్లించమని కేంద్ర ఆర్థిక మంత్రాంగం రాష్ట్ర ప్రభుత్వంపైన ఒత్తిడి తెస్తున్నది. ఓవర్ డ్రాఫ్టుల భారం తగ్గాలంటే రాష్ట్ర ప్రభుత్వం కొత్త పన్నులను వేయాలి. ప్రణాళికేతర ఖర్చును తగ్గించాలి. ఇందులో మొదటిది ఇప్పట్లో జరిగేది కాదు. ఎన్నికల ముందు కొత్త పన్నులు వేయడానికి ఏ ప్రభుత్వమూ సాహసించదు. ఎలాంటి ఇబ్బంది కేంద్రానికి లేదు కనుక బంగ్లాదేశ్ ఖర్చుల పేర ఆర్డినెన్సుల ద్వారా కొత్త పన్నులను కేంద్రం విధించి రూ. 70 కోట్లు అదనంగా సేకరించడానికి పూనుకున్నది. రాష్ట్ర ప్రభుత్వాలను కూడా పొదుపుచేసియైనా సరే అదనపు ఆదాయపు వనరులను చేకూర్చుకొనమని సలహా యిస్తున్నది.

ప్రణాళికేతర ఖర్చును తగ్గించుకొనడం సాధ్యమే. కాని మన ప్రణాళికా వ్యయమే తక్కువ. ప్రణాళికేతర వ్యయాన్ని కూడా తగ్గించుకొనవలసి వస్తే, అభివృద్ధి పథకాలపైన ఖర్చును ఇంకా కుదించవలసి వస్తుంది. ఇది ఆర్థికమైన స్తబ్దతకు దారి తీస్తుంది.

## ముల్కీ సమస్య

రాష్ట్ర ప్రభుత్వం ఎదుర్కొంటున్న రెండవ ముఖ్యమైన సమస్య ముల్కీ నిబంధనలకు సంబంధించినది. ఈ విషయమై కేంద్రం ఎలాంటి హామీలు ఇచ్చినా అమలు చేయాలనేది తమ ప్రభుత్వ విధానమని ముఖ్యమంత్రి పదే పదే చెప్పారు. కాని కేంద్రం హామీలు ఇంకా రాలేదు. కేంద్ర ప్రభుత్వానికి కూడా ఇది గడ్డు సమస్యగానే తయారైంది. 1958 లో పార్లమెంటు ఆమోదించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉద్యోగాల చట్టం రాజ్యాంగ విరుద్ధం గనుక చెల్లనేరదని సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చింది. దీని తరువాత రాష్ట్ర హైకోర్టు మరొక కేసునందు పై చట్టం రద్దయి నంతమాత్రాన ఆ చట్టం అమలులోకి రాకపూర్వం ఆచరణలో ఉన్నటువంటి ముల్కీ నిబంధనలు (నిజాం నవాబు ఫర్మానా ద్వారా అమలు చేసినట్టివి) రద్దు కాలేదని [illegible] కోర్టు ఇద్దరు న్యాయమూర్తుల బెంచి ఏకగ్రీవంగా తిరుగు తీర్పు ఇచ్చింది. ఈ ముల్కీ నిబంధనలు చాలాకాలంగా అమల్లో ఉన్నాయి. గెజిటెడ్ ఉద్యోగాలకు కూడా అవి వర్తిస్తాయి. వాటిని 1956 నవంబరు 1 (ఆంధ్రప్రదేశ్ అవతరణ) నాటినుంచి అమలు చేయాలంటే ఎన్నివేల ఉద్యోగుల సీనియారిటీలు తారుమారు కావలసి ఉంటుంది. ఇటువంటి క్లిష్ట సమస్యకు పరిష్కారం ఏవిధంగా రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు



సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ డైరెక్టర్ జనరల్‌గా నియుక్తులైన ఆంధ్రప్రదేశ్ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ ఆత్మా జయరామ్
(—ఫోటో : శ్రీధర్)

తోచిస్తున్న రోజుల్లో మరో ఐదుగురు న్యాయమూర్తులు గల బెంచి తీర్పుకు ఈ విషయాన్ని వదిలి వేయాలని హైకోర్టు నిర్ణయించింది. ఈ బెంచి విచారణ ప్రారంభించి రెండురోజులు కాలేదు. ఇంతలో ఈ విచారణను నిలుపుదల చేస్తూ సుప్రీమ్ కోర్టు స్టేఆర్డరు ఇచ్చింది. సుప్రీమ్ కోర్టువారి నిర్ణయం వచ్చేవరకు ఈవిషయమై కేంద్రప్రభుత్వం కాని రాష్ట్రం హైకోర్టుకాని ఈవిషయంలో ఏచర్యా తీసుకొనడం కష్టం. ఏమైన హైకోర్టు ఇరువురు న్యాయమూర్తుల బెంచి ఇచ్చిన తీర్మానం ప్రకారం ముల్కీ నిబంధనలు అమలులో ఉన్నట్లే లెక్క కనుక వాటి నమలు చేయడమే ప్రభుత్వ విధానమని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఐతే వీటినే విధంగా అమలు చేయాలి, అమలు చేయడం వల్ల ఉత్పన్నమయే సమస్యలను ఏ ప్రాతిపదికపై పరిష్కరించాలనే విషయం కేంద్రం పరిశీలనలో ఉంది కనుక, వారి నిర్ణయాలను తు.చ. తప్పకుండా అమలు చేస్తామని ముఖ్యమంత్రి చెప్పారు.

## ఎలా చేసినా ఎవరో ఒకరికి అసంతృప్తి

ముల్కీ నిబంధనలు 1956 పూర్వం నుంచి కూడా అమల్లో నున్నాయని భావించి ఆ ప్రాతిపదికపై తగు చర్యలు తీసుకుంటే ఇటీవల చేసిన నియామకాల నన్నింటినో రద్దు చేయడమో లేక వారిని ఆంధ్రప్రాంతానికి బదిలీ చేయడమో జరగాలి. ఇది న్యాయవిరుద్ధమూ చట్టవిరుద్ధమూ కావచ్చును. అంతేకాక ప్రభుత్వ సిబ్బందిలో— ఆంధ్రప్రాంతానికి చెందిన వారిలో— తీవ్రమైన అసంతృప్తికి కారణభూతం కావచ్చును. అమలు చేయకపోతే, తెలంగాణా సిబ్బందిలో అలజడి జరగవచ్చును. కొత్త మంత్రివర్గం ఇప్పటివరకు సమిష్టిగా ఈ విషయాన్నంతా కూలంకషంగా పరిశీలించినట్లు లేదు.

—వి. నాగేశ్వరరావు

---

### అదీ...ఇదీ:

గుల్బర్గా ఆంధ్ర సాంస్కృతిక సంఘం వారు దసరా ఉత్సవాలని వైభవంగా జరుపుతున్నారు. ఈ సందర్భంగా సంఘం సభ్యులు, 'వక్రగతులు,' నాటికని, ఏకాంకిక నాటకాన్ని ప్రదర్శించారు. బహుమతి పొందిన నటులకి శ్రీమతి ఏ. వి. చింతామణి రావు బహుమతి ప్రదానం చేశారు. (ఒ. వి.)

*

బరంపురంలోని సాహితీ సంస్కృతి సంవేదిక, 'వికాసం' (రిజిస్టర్డ్) అక్టోబరు 9 రాత్రి తొమ్మిదిన్నరకు వికాసం సభ్యురాలు కుమారి దేవి నృత్య ప్రదర్శన స్థానిక ప్రకాశం హాల్లో ఏర్పాటు చేసింది. (ఒ. వి.)

### వి వా హం

శ్రీ అంధే వెంకటరమణారావుగారి కుమారుడు చి: గోపాలకృష్ణమూర్తి (అంధేవ్)కి శ్రీ బి. జగన్మోహన్ రావు గారి కుమార్తె చి. సౌ: కృష్ణవేణికి అక్టోబరు 24వ తేదీన అన్నవరంలోని శ్రీ సత్యనారాయణ స్వామి ఆలయంలో వైభవంగా వివాహం జరిగింది.

# ఒక వారం విపరీతం
## ఫాలాక్షుడు

### పెరుగుతున్న కాన్సర్

హిందూదేశంలో రానురానూ కాన్సరు వ్యాధి వ్యాపిస్తున్నదని, ఒక మిలియను జనాభాకు ఇదివరకు వెయ్యి నుంచి పదిహేను వందల వరకూ కాన్సరు రోగులుంటే, ఇప్పుడు రెండు నుంచి మూడు వేల వరకూ వున్నారని జె. కె. కాన్సర్ ఇన్స్టిట్యూట్ డైరెక్టరు మిస్టర్. పి. కె. హోల్కార్ అన్నారట కాన్పూరులో మాట్లాడుతూ. ఈ కాన్సరును సకాలంలో కనుగొనగలిగితే నయం చేయడం చాలా సులభమని కనుక ప్రజలు కూడా జాగ్రత్తగా వుండి డాక్టర్ల చేత పరీక్షించుకోవాలనీ ఆయన అన్నారట.

### బాలుని పొట్టలో కిలోల రాళ్ళు !

కేరళకు చెందిన వో ఆరేళ్ళ పిల్లాడు కడుపునొప్పి బాబోయ్ అని బాధపడుతుంటే తిరూరు ఆసుపత్రి




అధికారులు అతనికి ఎక్స్‌రే తీసి, కొయ్యబారిపోయారట. తేరుకున్నాక అతని పొట్టలోంచి వో కిలో బరువు కల చిన్నచిన్న రాళ్ళు తీశారట. ఇంకా ఆ కుర్రాడి కడుపులో చాలా రాళ్ళున్నాయని, అవి కూడా ఆపరేషను లేకుండానే తీయగలమనీ ఆసుపత్రి అన్నదట.

### పార్సెల్‌లో బాంబు

లక్నో పోస్టాఫీసులో వో అయిదుగురు వుద్యోగులు మొన్న 12 వ తేదీన ఆ రోజు మిగిలిన పార్సిళ్లలో తనిఖీ చేస్తుండగా ఉన్నట్టుండి ఉమ్మాల్పి వో బండి ప్రేలిందట. దాంతో యిద్దరు తీవ్రంగా మిగిలిన ముగ్గురూ మామూలుగా గాయపడ్డారట. వాటీజ్ఇన్పార్సిల్!

నెడక్కావు అనే వూరిలో ఒకాయన తన భార్యను ఆమె ప్రియునికి అంకిత మిచ్చాడట.

### ఈతలో కొత్త రికార్డు

కలకత్తాలో అరుణ్‌కుమార్‌నందే అనే బంగదేశ్ వ్యక్తి అక్టోబరు ఎనిమిదవ తేదీ ఉదయం 8.30 నుంచి 12 వ తేదీ మధ్యాహ్నం 2.40 వరకూ ఏక బిగిన 90 గంటల అయిదు నిమిషాల కాలం యీది, ప్రపంచ రికార్డును బద్దలు కొట్టి కొత్త రికార్డు సృష్టించాడట. ఇంతకుముందు ఫ్రెంచి దేశస్థుడు 88.56 గంటలు యీది ప్రపంచ రికార్డును స్థాపించాడట.

### అద్దంముక్కలు ఆవుపేడతో సన్‌గ్లాస్

ఆవు (లేక గేదె) పేడ, పగిలిన గ్లాసు ముక్కలు యివన్నీ వృధా అవపనిలేదని, యీరెంటినీ సంధించి చక్కని అందమైన (సన్‌గ్లాసు వంటిది) పలకలుగా తయారు చేయవచ్చనీ, యీ పలకలు చాలా గట్టిగా కోయడానికి అనువుగా, మృదువుగా వుంటాయనీ లాస్‌ఏంజలిస్ కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ జె. డి. మెకన్సీ అన్నారట. విన్నారుగా!




### చిలికి చిలికి గాలివాన

మైసూరు రాష్ట్రానికి చెందిన తొల్లపల్లిలో నారాయణప్ప అనే ఆయనకూ ఆయన భార్య వెంకటలక్ష్మమ్మకూ ఏదో విషయం మీద తగూ లొచ్చి, అది చిలికి, విజృంభించిందట. తత్ఫలితంగా కోపంతో నారాయణప్ప తన భార్యను పొడిచి చంపి, ఆవేశం తగ్గాక, తాను విషం తాగి ఆత్మహత్య చేసుకున్నాడట.

### కాన్పుకి నలుగురు పిల్లలు !

వెంకటగిరి కోటకు చెందిన 34 ఏళ్ళ పుట్టమ్మ అనే ఆవిడ రాబర్ట్సన్‌పేట ఆసుపత్రిలో ఒకే ప్రసవంలో నలుగురు పిల్లలను కన్నదట. ఆమెకు యిది మూడవ కాన్పుట. గడచిన రెండు కాన్పులలో కూడా




ఆమె కాన్పుకు నలుగురు పిల్లలు చొప్పున కన్నదట. ఈ కాన్పుతో చేర్చి యీమెకు ఎనిమిండుగురు మగ పిల్లలు నలుగురు ఆడ పిల్లలని తేలింది. తల్లీ పిల్లలూ కులాసాగా వున్నారని ఆసుపత్రి అన్నది. హాట్సాఫ్ టు ఫామిలీ ప్లానింగ్ స్క్వాడ్ !!

* * *

ఒడుగత్తూరు గ్రామానికి చెందిన జవ్వాదు మలై అనేచోట సుబ్బన్ అనే ఆయన భార్య రాధ తమ బంధువైన స్వామినాథన్ అనే అతనితో అక్రమ సంబంధం పెట్టుకున్నదట. ఈ సంగతి పసిగట్టిన సుబ్బన్ తన భార్యను గడ్డికోసుకు రమ్మని పంపి, ఆనామెను వెంటాడాడట. గొడ్ల కాపలా కాస్తూ నార్చున్న స్వామినాథన్ దగ్గరకి వెళ్ళి అతనితో ముచ్చట్లు చెప్తూ కూర్చున్నదట రాధ. వారి ప్రేమకలాపం కళ్ళారా చూసిన సుబ్బన్ కొడవలితో స్వామినాథన్ మీద విరుచుకుపడి ఇష్టారాజ్యంగా అతని శరీరాన్ని తెగనరికాడట. అడ్డొచ్చిన రాధను కూడా నరికేశాడట. స్వామినాథన్ మటుకు ఆసుపత్రికి తీసుకువెళ్లే దారిలో చనిపోయాడట.

* * *

ప్రతి చోటా అందాల సినిమా తారలు శుద్ధమైన సౌమ్యమైన లక్స్ గురించి ఏమంటున్నారో విన్నారా ?

అందాల సినిమా తార
విజయలలిత
ఏమందో వినండి:

**'లక్స్ నా లావణ్యాన్ని అత్యుత్తమంగా ఇనుమడిస్తుంది'**




మీరు కూడా ఎవరో ఒకరికి దివ్య తార యేగా—
మీ లావణ్య పోషణను లక్స్‌నే చేయ నివ్వండి!

లింటాస్-LTS. 284-140 TA

హిందుస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

**నెం. 89: 14 క్లూలు (తెలుగు తర్జుమా)**

(1) అనురాగం / కళ ఒక గతిశీల ప్రక్రియ అయివున్నది. ఒక రూపంలో ఆరంభమై మరి యొక రూపంలో అంత్యమగును.

(2) కృషీవలుని జీవనం ఎంత తమాషాయైనది తన పూర్వజాల / పశువులచేత పాలింపబడుతుంది.

(3) తప్పొప్పుల సందర్భంలో అత్యధిక మేరకు జనుల భావములు పరిస్థితుల / ఆచారముల అనుసారం మారుచుండును. ఇది ఎంతో వింతయైన విషయం.

(4) ఆస్తి, మనకు మనమే జ్ఞప్తికి తెచ్చుకోవాలి, ఒక చాలా పురాతన మానవీయ అలవాటు సభ్యత/మతము అంతకంటె కూడ మరీ ఎక్కువ పురాతన మానవీయ అలవాటు.

(5) స్వాభావికమైన సవ్యంగా నడుచుకోని వారితో వ్యవహరించుటకు/కలిసియుండుటకు ఓర్పు, అనుకూలన శీలత, ఉపాయ నైపుణ్యత, మరియు సరియైన నిర్ణయం అవశ్యకమై యున్నది.

(6) యోచన క్రియను ప్రేరేపిస్తుంది, క్రియ అలవాటును సృష్టించుతుంది. అలవాటు నడతను సృజించుతుది., మరి నడత గతిని/వ్యక్తిత్వమును నిశ్చయించును.

(7) ఒక వ్యక్తి యొక్క నిజమైన నిర్ణయం అతను ఏమి చేయును / సంపత్తి ఎంత అనేదానిని బట్టికాదు కాని అతను ఎవరు అనే దానినిబట్టి యుండును.

(8) ప్రపంచమందలి అత్యధిక ప్రాంతములందు తక్కువ స్థాయిలో నున్న శిక్ష / పౌష్టికాహారం ఈనాడు ప్రపంచపు ప్రముఖ చింతలలో నొకటియై వున్నది.

(9) జ్ఞానమును ప్రసరింప జేయుటకు మరియు సుయోగ్యతా మార్గదర్శకతను సమకూర్చుటకు శిక్షకునికి చదివించి బోధించే నిమిత్తం మరియు, అదుపులో నుంచే/నేర్చుకొనే నిమిత్తం స్వతంత్రతను కలిగి యుండవలెను.

(10) ద్వేషము / ఇతిహాసము ప్రచారవ్యాప్తికి ఒక అంగముగా ఉపయోగించ బడినప్పుడు, అది చాలా ఘాతక అస్త్రమగును.

(11) కోపోద్రిక్తుడగు మనుష్యుడు సర్వశ్రేష్ఠ సామాజిక నియోజకుడు / కార్యకర్త కానేరడు.

(12) ప్రపంచంలో స్వల్ప అధికారశక్తి / ప్రశంసా టానిక్ పొంద యోగ్యుడుగాని మనుష్యుడు ఉండబోడు.

(13) తన వివేకమును / అధికారములను దురుపయోగ పరచే మార్గములను అన్వేషించుటలో మనుష్యుడు అంతులేని ప్రవీణుడు.

(14) మన తలంపులయొక్క సంపూర్ణ అంతరంగములో ఒక మూలస్థమైన స్వార్థత / దాస్యం చొచ్చుకుపోయింది.

**No: 89—14 CLUES**

(1) AFFECTION / ART is a dynamic process, beginning as one thing and ending as another.

(2) Funny how a farmer's life is ruled by his ANCESTORS / ANIMALS!

(3) It is curious how most people's ideas concerning right and wrong vary according to the CIRCUMSTANCES / CONVENTIONS.

(4) Property; we remind ourselves, is a very ancient human habit. CIVILISATION / RELIGION is a human habit even more ancient

(5) DEALING / LIVING with those who are not be having normally requires patience, adaptability, resourcefulness, and sound judgment.

(6) Thought impels action, action creates habit, habit forms character, and character decides DESTINY / PERSONALITY.

(7) The real judgment of a man is not what he DOES / HAS but what he is.

(8) The low level of EDUCATION / NUTRITION in most areas of the world is one of the main concerns of the present - day world.

(9) To communicate knowledge and to provide a model of competence, the teacher must be free to teach and to GOVERN / LEARN.

(10) When HATRED / HISTORY is used as a branch of propaganda. it is a very deadly weapon.

(11) The man roused to anger is not the best social PLANNER / WORKER

(12) There is no man on earth who does not deserve the tonic of a little POWER / PRAISE

(13) Man is endlessly ingenious in discovering ways of misusing his REASON / RIGHTS

(14) A fundamental SELFISHNESS / SLAVISHNESS has got into the very heart of our motives

లిట్ క్విజ్ కొటేషనులన్నియు రచయితల రచనల నుండి గ్రహింపబడినవి. అవి వేనికవే పూర్తి అర్థములు గలవి. ఒక్కొక్క క్యూలో మార్పు పదములు అక్షర క్రమమున ఏర్పాటు చేయబడినవి. మొదట మార్పు పదముల యొక్క అక్షర క్రమమున లా అన్నియు ఏర్పాటుచేయబడినవి లిట్ క్విజ్ అఫిషియల్ సొల్యూషనుతో రచయితల పేర్లు, వారి రచనల పేర్లు ప్రకటింపబడును.

# ఒకవారం విపరీతం

యజమాని హత్య

ఢిల్లీ తులసీనగర్‌కు చెందిన ఒక ఫ్యాక్టరీ యజమాని 31 ఏళ్ల రమేష్‌కుమార్ ధాండ్‌ను ఆయన ఫ్యాక్టరీలో పనిచేస్తున్న రాజబీర్ అనే పనివాడు చంపేశాడట. రాజబీర్ భార్యతో రమేష్‌కుమార్‌కు అక్రమ సంబంధముండడమే కారణమట— అంత పెద్ద రామాయణం నడవడానికి కారణం జెడ్డి!

ఎంత ఎక్కువసార్లు తింటే

అంత ఆరోగ్యమా!

కాలిఫోర్నియా డేవిస్‌కు చెందిన 73 ఏళ్ళజాన్సన్ అనే ఆయన రోజుకు 12 సార్లు తిని, వారానికి 150 మైళ్ళు యీ నాటికి పరుగెట్టుతారట. ఆయన ఆరోగ్యం అమోఘమని, దేహదారుఢ్యం అసమానమని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్




జా. ఎరిమోరి అన్నారట. డాక్టర్ ఎరిమోరి ఆయన్ను శతవిధాలా పరీక్షించి యీ ముక్క అన్నారట. జాన్సన్ 20 ఏళ్ళుగా పొగత్రాగటం మానివేశారట. ఎప్పుడయినా కాస్త నాలుకమాత్రం తడి చేసుకుంటాడట. అహా! మనం గూడా రోజుకు 12 సార్లు తింటే! హావ్? ఇండియా ఆర్థిక స్థితేమైపోతుంది!

* * *

తిరుచ్చిరాపల్లికు చెందిన అబ్దుల్ జఫార్ అనే 30 ఏళ్ళ ఆయనకు వివాహమై రెండున్నరేళ్ళు అయ్యిందట. ఆయన కో పచారి షాపు పెట్టి ఘోరంగా నష్టపోయి, ఆ నష్టాన్ని పూరించుకోడానికి తన భార్యను పుట్టింటికి వెళ్ళమంటే ఆమె నిరాకరించిందట. దాంతో ఆయన కాగ్రహం వచ్చి కత్తి తీసుకుని ఆ నవజీవన్నారి కీక నరికి చంపేశాడట. చట్టం ఆయనకు మరణశిక్ష విధించింది. ●




# వరుసగా యిచ్చు 3వ బంపర్

## ఛాయిస్‌క్విజ్ రు 14000

మీరు 4 వ కూపనులో సక్రమముగా పూర్తిచేసిన వాటిలోంచి 3 క్లూలను యెన్నుకొని ప్రక్కన వున్న ఖాళీలో "ఔను" అనే టిక్కు మార్కులు (✓) లతో గుర్తించండి. మీరు యెంచుకొన్న (3) సరియైనవని ఋజువైనయెడల మీరు ఛాయిస్ క్విజ్ యొక్క బహుమతియైన రు. 14000 ను పంచుకొనగలరు.

లిట్‌క్విజ్ నం 89 ప్రవేశ పత్రము

మొత్తము బహుమతి: రు. 1,00,000/— ఆఖరు ముగింపు తేది 17—11—71 గురువారం

ADDRESS LITQUIZ No 89 ALANKAR BALARAM STREET BOMBAY

గమనిక:— 1. ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి. 2. ఒక కూపను మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి, 3. ఎంట్రీ రుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండి పొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M.O. రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును. 4. I.P.O. క్రాస్ చేయవద్దు. ఈ లిట్‌క్విజ్ నం. 89 ... 7 వారికి చెల్లింపబడును ...

| ❀ | 1 | Re. 1 | 2 | Re. 1 | 3 | Re 1 | 4 | Re. 1 | FREE |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | AFFECTION | ART | AFFECTION | ART | AFFECTION | ART | AFFECTION | ART | |
| 2 | ANCESTORS | ANIMALS | ANCESTORS | ANIMALS | ANCESTORS | ANIMALS | ANCESTORS | ANIMALS | |
| 3 | CIRCUMSTA- | CONVENT- | CIRCUMSTA- | CONVENT- | CIRCUMSTA- | CONVENT- | CIRCUMSTA- | CONVENT- | |
| 4 | CIVILISAT- | RELIGION | CIVILISAT- | RELIGION | CIVILISAT- | RELIGION | CIVILISAT- | RELIGION | |
| 5 | DEALING | LIVING | DEALING | LIVING | DEALING | LIVING | DEALING | LIVING | |
| 6 | DESTINY | PERSONA- | DESTINY | PERSONA- | DESTINY | PERSONA- | DESTINY | PERSONA- | |
| 7 | DOES | HAS | DOES | HAS | DOES | HAS | DOES | HAS | |
| 8 | EDUCATION | NUTRITION | EDUCATION | NUTRITION | EDUCATION | NUTRITION | EDUCATION | NUTRITION | |
| 9 | GOVERN | LEARN | GOVERN | LEARN | GOVERN | LEARN | GOVERN | LEARN | |
| 10 | HATRED | HISTORY | HATRED | HISTORY | HATRED | HISTORY | HATRED | HISTORY | |
| 11 | PLANNER | WORKER | PLANNER | WORKER | PLANNER | WORKER | PLANNER | WORKER | |
| 12 | POWER | PRAISE | POWER | PRAISE | POWER | PRAISE | POWER | PRAISE | |
| 13 | REASON | RIGHTS | REASON | RIGHTS | REASON | RIGHTS | REASON | RIGHTS | |
| 14 | SELFISH- | SLAVISH- | SELFISH- | SLAVISH- | SELFISH- | SLAVISH- | SELFISH- | SLAVISH- | |

BOTH FREE AFTER 4 COUPONS

## MINIQUIZ

89

| | | | |
|---|---|---|---|
| DOES | HAS | PLANNER | WORKER |
| EDUCATION | NUTRITION | POWER | PRAISE |
| GOVERN | LEARN | REASON | RIGHTS |
| HATRED | HISTORY | SELFISH- | SLAVISH- |

## CHOICEQUIZ

Pick any 3 clues you feel you have correctly solved in your 4th coupon and indicate them in the adjacent corresponding blank spaces with 'yes' tick-marks (✓). If all your 3 choices prove correct you share the Choicequiz prize of Rs. 14,000.

ఈ పోటీ ... ప్రవేశమునకు సంబంధించిన నిబంధనలను, షరతులను ... పంపుటకు అంగీకరిస్తున్నాను మరియు ... పబ్లిషర్స్ నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/— ఈ పూర్తి ఎంట్రీ ఫారము (4 కూపనులకు) ఫీజు రు. 4/— M.O. రసీదు / I.P.O. / లిట్‌క్విక్ క్యాష్ రశీదు / ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.....................

నెం. 90 ఫారములు పొందుటకై దీనిని పూర్తిచేయండి.

FULL NAME ..............................

..............................

ADDRESS ..............................

..............................

..............................

POST .................... DIST. ..........

89 ASVPI

IN ENGLISH: BLOCK LETTERS

FULL NAME ..............................

..............................

ADDRESS ..............................

..............................

..............................

POST .................... DIST ..........

గమనిక:—ఇవన్నియు ... నికి రచయిత ... పదములే సరియైన ... లిట్‌క్విజ్ తేది 21—11—71 గల సండే స్టాండర్డ్ ... ఎడిషన్ (కవరు పేజీ)నందున్న బహుమతుల పట్టీ లిట్‌క్విజ్ పత్రిక అడ్వాన్సు 28—11—71 యందును, పూర్తిగా కుదింపబడి తేదీ 5—12—71 సండే స్టాండర్డ్ సంచిక ప్రకటింపబడగలదు. 30 ... 3 భాషలలో ... పొందండి.

మినిక్విజ్ 20,000

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

# విశ్వనాథ సత్యనారాయణగారి రచనలు-2

విశ్వనాథ సత్యనారాయణగారు ప్రతిభా ప్రబుద్ధాంధ్ర వంటి పత్రికలలో మాక్సీ దుస్తులో కుక్క, నీగ్రో—కథ వంటి చక్కని చిన్న కథలను రచించారు. మొదటిది ఆంగ్ల మానవప్రవృత్తుల ఆదర్శ కబుర్ల ఆచరణావిహీనతనూ వ్యంగ్యముగా బయట పెట్టుతుంది. జంతువుల జాతి భేదాన్ని పెంచే మహానుభావుడు మానవుల సంఘటనాన్ని పొగుడుతాడు. కథలో రెండు రకాల మిశ్రమమైన కుక్క రెండింటి సుగుణాలు కనపరుస్తుంది. రెండో కథ ఆఫ్రికా అడవులలో నీగ్రో కుటుంబపు కథ. సత్యనారాయణగారు అందులో నీగ్రో భాషలోని పాటరాశారు! వారు అపరిచిత సీమలలో ప్రవేశించి అనుభవించగల రచనలు చేయగలరనడానికి ఆ కథ మంచి ఉదాహరణం. ఆ కథలు ఏ పత్రికవారైనా ప్రచురిస్తే బాగుండును.

నన్నడిగితే సత్యనారాయణగారి ప్రతిభ వారి వచన రచనలలోనూ, వ్యుత్పత్తి పద్యరచనలలోనూ ఎక్కువగా గోచరిస్తుందంటాను. 'ఏకవీర' వారి మొదటి ప్రసిద్ధ నవల. పేరునే కాకతీయుల త్రిలింగ సామ్రాజ్యపురోజులనుండి తెచ్చుకున్నారు. రంగము వారికంతగా పరిచయములేని దక్షిణ భారతసీమ. అయినా రాయపాచకము స్ఫురింపజేసే వాతావరణాన్ని వైగై, సుందరేశ్వరుడూ, స్వాతివతి, సేతుపతి, అలాగా సముద్రము, ఉపయోగించి నిర్మించినారు. కథ రవీంద్రుని నౌకాడూబీ కథకంటె సౌష్ఠవము పెంచుకొన్న, రెండు ప్రియ జంటల వివాహపు మారుగిళ్ళ కథ. ఆ హతభాగ్యులను ఒకచోట చేర్చినారు సత్యనారాయణగారు. రవీంద్రుడు హేమనళినిని కమలాక్షుని సమీపానికి తెచ్చెను. కాని చేర్చ లేదు. అక్కడ రమేశ్ కమలలనూ ఇక్కడ కమలాక్ష హేమనళినిలనూ చేర్చి కథ నడిపేరు సత్యనారాయణగారు. నాకు చూడగా సత్యనారాయణగారు ఏకవీర త్యాగేంద్రియ చైతన్యమును నిర్మించడానికే ఈనవల రాశారా అనిపిస్తుంది. ఉదాసీనుడైన కుట్టాన్ 'ఏకవీరా' అని పిలవగనే ఆమె వాయువునకు కదళివలె నిలువెల్ల వణికి క్రిందపడిపోయినది. ఈసున్నితశరీరిని వానలో చూడండి: వానబొట్లు జాజియాకుల చివరల జాజి తావులమీద నిలిచి ముత్యముల వలె గులుకుచుండెను. చల్లగాలి పార యేకవీర మీదికి విసురుకొనెను. ఆమె త్యాగేంద్రియము మీద మెఱుపు మెఱసినంత కాలములో నొక తడిగుడ్డవేసి తీసినట్లు తోచెను. మఱల నొక చల్లని గాలి తెర యేకవీర మీద బోసికొనెను. ఆ గాలివేగమునకు జాజిపందిరి కదలాడి పోయెను... ఆమె పంచేంద్రియ గుణములు స్పర్శగుణత్వము పొందెను.' ఈ స్ఫురణతో వీరభూపతి చేతులచడుమ ఏకవీరనూ నడిరాత్రి వైగైనదిలో కుట్టాన్ పట్టుకొన్న ఏకవీరనూ, సత్యనారాయణగారు వర్ణించినది చదివితే, అవి సత్యనారాయణగారి ప్రతిభకు రెండు కన్నులవలె మెరసాయి. 'వీరభూపతి..దగ్గరదగ్గరకు వచ్చుచుండెను. ఏకవీర చేతులు చాచుకొని నిలబడినది, ఆమె యొడలెల్ల చెమ్మట పోసెను...ఆమె పాదముల క్రింది భూమియల్లల నాడె. ఆమె నిలువెల్ల పులకించెను. అతడామె చేతులు తన చేతులతో దాకెను ఆమె దేహముమీది కొక విద్యుత్ప్రవాహము ప్రవహించెను...అతనిచేతులామెదేహముచుట్టు చుట్టుకొనెను ... ఆమె త్యాగేంద్రియము నర్మదస్నుగా శిశిరాతి శిశిర మయ్యెను; అతడామె నెదుఱొమ్మున నాన్చుకొనినాడు. ఆమె కన్నులనిండ నశ్రువులు నిండి యుండెను. అతడామె పెదవిపై నొక్కి యద్దెను...అతని స్పర్శయు నాడి యామెలో వియచ్చేంద్రియమునకు గూడ సోకినది...(ఆమె నేలబడినది)'. ఇక వైగై నదిలో ఏకవీర : 'హఠాత్తుగా కుట్టాన్ రెండుచేతులామె దేహముచుట్టు చుట్టినెను ... వైగై తరగల సవ్వడి, గాలి...సడి యామె చెవులకు వినబడదు...ఆమె త్యాగేంద్రియము చైతన్యరహితమయ్యెను. అతడామె నెదుఱొమ్మున నాన్చుకొనెను. ఆమె నేత్రములలో జాలి తప్పిపోయెను...అతడామెను గాఢాతి గాఢముగా నొక్కుకొనెను. ఆమె సౌరంధ్రములలోని శ్వాసమాడలేదు. ఆమెలో నాడి



నిలిచిపోయెను. అతడామె పెదవి తన పెదవి తాకెను. ఆమె హృదయములో ప్రాణవాయువు నిలిచిపోయెను.. కుట్మానునకు ప్రబోధము కలిగెను. తన కౌగిలిలోని నిర్జీవ పదార్థమతడు వెనుకకు ద్రోసెను. అది మోకాలిబంటి నీటిలోబడి చప్పుడయ్యెను. చీకటులు క్రమ్మి నల్లనిగుడ్డ కప్పబడిన గత ప్రాణివలె వ్రేగై తరలిపోయెను.' పద్యాలలో తుంగభద్రలాగ మలుపులు తిరిగే సత్యనారాయణగారి కవిత హృద్యములో గంగాప్రవాహము!

కథా సన్నివేశాలైనా మాధవవర్మలో తప్ప, తక్కిన ఖండ కావ్యాలలో విశ్వనాథ వారు ఇముడ్చలేదు. ఏకవీరలో వీరభూపతి మిత్రులూ, ఏకవీరా కుట్మానులూ విహుడు చేరినా అది సన్నివేశమే. ఇక ఏకవీరా, వీరభూపతులూ, కుట్మాన్ ఏకవీరలూ చివరి మారు కలసిన ఘట్టాలు గంగాయమునా సంగమాలు. ఏదైనా చిన్న ఏమరిపాటు ఈ వాక్యమూ ఆ వాక్యమూ మధ్య ఉన్నా అప్పటి భావసంరంభములో వరిగిపోయి దాటిపోయింది గాని కనబడదు. 'చెలియలి కట్ట'లో రత్నావళి మరిదీ చేరిన సన్నివేశాలు మానసత్య ప్రధానాలై అంతటా కరిగి లీనమైయున్న మన అపేక్షను గెంటుకు పోతాయి. చివ్వర రత్నావళి ఆమె భర్త చేరిన ఘట్టము చెలియలి కట్టకు ఈవలిది. ఇక అటు సముద్రమే. 'రత్నావళి సముద్రమువైపు వెళ్ళిపోయెను.'

వేయి పడగలు ఆరంభమునే 'వేయి పడగల పాము విప్పారుకొనివచ్చి, కాటందుకొన్నది కలలోన రాజును' అంటూ లాగుతుంది మన దృష్టిని. ఖండకావ్యాలవంటి వర్ణనలూ కథలూ సమయ సన్నివేశాలూ, ఇవీ వేయిపడగలు అనిపిస్తుంది నాకు. గిరిక నృత్యసందర్భములో అనంతరసూచనలు నిండించుకొన్నవి వర్ణనలు. సుబ్బన్నపేట పేదకాపు పాలీయుని ఆవుకథ, నాగేశ్వర శాస్త్రికథ, వీరన్నాయనికథ, గణాచారి కథ, ఇలాటివే పెద్దకథా చిన్నకథా చెప్పుతున్నా వన్నెస్ఫురణ లేకుండా చెప్పేరు సత్యనారాయణగారు. వేయిపడగల కథ అవలిది చెపితే చిన్నదే కన్యాశుల్కం కథలాగ. అంత మాత్రమూ లేదేమో. అయితే కొమ్మలూ ఆకులూ పండ్లూ ఊడలతో మర్రిచెట్టులాగ విస్తరించింది పాత్రల శీలాలూ కథలతో. ప్రతిపాత్ర తలచుట్టు ప్రభామండలమువలె కథ వినపడుతుంది. ఆ కథలను సన్నితొడిమెలతోనే కొమ్మలకతికించినా తరవాత మరితీగెలతోనూ స్వంత దళాలతోనూ అలంకరించారు కవిగారు. కథలలో ప్రకృతి భాగస్వామియైనట్లు చేసే వర్ణనలు ఆ కొమ్మను మాత్రమే ప్రభావంతముచేసే సూర్యరశ్మిలాగా, దానినే కదిపే గాలిలాగా పనిచేశాయి. ఈ శిల్పము ఆయన ప్రత్యేకత. 'పిండయేమో కనబెక్కి మహాభుజంగమొకడు కుపితమై బుస్సుమని పడగవిప్పి తోక మీద లేచినట్లు దుర్నిరీక్ష్యమయిపోయెను' అంటారు. కుమారుని విలాసహాయముల ఖురఘట్టనాలకు నెత్తురోడి

# ప్రశ్నావళి

...కె. రామలక్ష్మి...

శారత్, అత్మకూర్

మీరు పండిత పుత్రికయా?

కాదు.

**పి. వి. వి. కె, హైద్రాబాదు**

అరచేతి మందం పౌడరు వాడితే అది సహజ సౌందర్యం కాదని తెలిసీ పౌడరెందుకు వాడుతారు?

సహజ సౌందర్యానికి మెరుగులు దిద్దేదిగా వుండాలి అలంకరణ. పౌడరు తెల్లదనంకోసమే కాదు—ఫ్రెష్‌గా వుండడానికి కూడా.

**హెచ్. డి, వికారాబాద్**

విరాశ నిర్లిప్తత హృదయంలో గూడు కట్టుకొని ఉన్నప్పుడు జీవితాన్ని పొడిగించాలని ఆశలేనప్పుడు ఏవో కొన్ని ఆశలను మొలకల వలె రేపిదైవం ఏం చేస్తూ వుంటాడు?

అటువంటి పరిస్థితిలో మన ప్రవర్తన పరిశీలిస్తూ ఉంటాడు.

**వి. ఎస్. ఆర్, గుంటకల్**

రామలక్ష్మిగారూ అసూయ ముందా? అసూయ ముందా

అసూయే.

**వెంకట్, ఉరవకొండ**

మా స్నేహితు డొకనికి మంచిమార్కులు వస్తుంటాయి. వాడికి స్కాలర్‌షిప్ యివ్వమని అడిగితే 'మీది ఫార్వడ్ కేస్టు' అని తిరస్కరిస్తున్నారు. నిజానికి వాడు చాలా పేదవాడు. వాడి కులం తక్కువ అయినే మటుకు వాణ్ని చదివించకలదా?

ఇలాగే ఉంటుంది మెరిట్‌ను వెనక బెంచిమీద వేస్తే. అందుకే అంటాను— కొన్నాళ్ళకి— 'మమ్మల్ని షెడ్యూల్డు కాస్టు అండ్ ట్రయిబ్స్‌లో చేర్చండి' అని ఫార్వరడ్ కేస్టువాళ్ళు పిటిషన్లు పెట్టుకోక తప్పదని. పేదతనానికి బ్రాహ్మణ అబ్రాహ్మణ ఏమిటి నా ముఖం? అంతా ఒకటే.

**ఎస్. ఎస్, విశాఖపట్నం**

మానవుడు ఎన్నోవిధాల బాధపడు తున్నప్పటికి బ్రతుకుమీద ఆశ పెంచుకుంటాడు దేనిచేత?

ఈ బాధలు శాశ్వతంగా ఉండిపోవనీ, ఎప్పటికేనా సుఖపడే కాలం వచ్చితీరుతుందనీ— ఆశ అతన్ని బ్రతికేలా చేస్తూనే ఉంటుంది.

**బి. వి. ఆర్, కొత్త బొమ్మవానిపాలెం**

నాకు కులం అనే భేదం లేదు. తక్కువ కులంలో అమ్మాయిని పెండ్లిచేసుకోవాలనుకుంటున్నాను. మీదగ్గిర ఎవరైనా ఉన్నారా?

మీ రక్తంలో జీర్ణించి పోయింది కులం— లేకుంటే కులం ప్రసక్తి లేదంటూనే 'తక్కువ కులం' అమ్మాయి అని ఉండరు! అయినా నేనేం— జాతకాలు సేకరిస్తానా? నా దగ్గిర ఉండడానికి!

**కె. ఎవ్. ఆర్, రాయగడ**

ఈ ప్రశ్నలు జవాబులవల్ల— అటు పాఠకులకు యిటు మీకు మధ్య పత్రిక వ్యవస్థాపకులు కాలము కాగితము వృధా చేస్తున్నారని భావిస్తాను.

చిత్తం. వ్యవస్థాపకులు, పాఠకులు అలా అనుకోనంత కాలం మేం యీ ఒక్కపేజీ, కాలం కాగితం వృధా అనుకోము. సరేనా.

**బి. ఆర్. ఆర్. ఆదోని**

మీరు కాకాకి లొంగిపోతారని విన్నాను మీరు లొంగరా?

**కె. ఎస్, వెంకటగిరి**

ఎవరండీ ఆ ఒంగోలు జిజ్ఞాసువుగారు? నాస్తికులపై అంత జాలి! పాపం. నాస్తిక జీవులపై జాలి పడడం తప్పించి వేరే పని లేదులా వుంది పాపం!

అయ్యో పాపం. కాలేజీ కుర్రాడివి పుస్తకాలు చదువుకోవడం తప్పించి పనిలేదులా వుంది. పోనీ ఆస్తికులపై జాలిపడు బాబూ.

**జి. వి. ఎస్. ఎల్, విశాఖపట్నం**

ప్రపంచంలో అతి తేలికైన వస్తువు, అతి బరువైన వస్తువు ఏది? ఈ రెంటినీ మానవుడు ఉపయోగిస్తున్నాడా?

బుద్ధి. అడపా తడపా ఉపయోగిస్తూనే ఉన్నాడు కదండీ?

**పి. ఆర్. ఆర్; కె. జి. ఎం, ఆర్యూమరు**

ప్రేమించుటకు, రిజిస్ట్రీ మ్యారేజి చేసుకొనుటకు తగిన అర్హతలు, నిబంధనలు ఏమిటి?

ప్రేమించడానికి ఎదుట ఒక వ్యక్తి, రిజిస్టరు పెళ్లిచేసుకొనుటకు వయోజనదశా అయిఉండాలి. అంతేకాదు—ఒకభార్య బ్రతికి ఉండకూడదు. ఉన్నా తమరు విడాకులిచ్చి ఉండాలి—రిజిస్టరు పెళ్లికి!

**పి. ఎమ్, ఎర్రపల్లిగ్రామం**

రామలక్ష్మిగారూ ప్రేమంటే ఏమిటి? వ్యక్తిత్వం అంటే ఏమిటి? చెప్పండి చూద్దాం.

ప్రేమంటే తనని తను మరచిపోయి కోరుకున్న వ్యక్తికోసం బ్రతకడం ప్రారంభించడం. వ్యక్తిత్వం అంటే—మనుష్ని చంపుకోకుండా, తనని తాను గౌరవించుకుంటూ బ్రతుకకల్గడం.అది చాలాకష్టం!!

**పి. ఎస్, విజయవాడ**

మానవజాతి అంతా తరతమ భేదాలు లేక ఒకటే కదా. మరి మీ స్త్రీలకు ప్రత్యేక ప్రతిపత్తి ఇవ్వడంలో మీ ఆంతర్యం ఏమిటి?

మానవజాతి తొలుదొలుత అలాగే ఉండేదటంటే, కాని రానురాను స్త్రీ స్వాతంత్ర్య మర్హతి అనే వాకా తెచ్చారు.అంచేత పరిస్థితులు మారుమారుతున్నాయి. ఇక ప్రభుత్వమే స్త్రీల ప్రతిపత్తి పరిశీలించకే పూనుకుంది. చేసినగా ఎంత? మనలోమనమాట— ఇచ్చామన్న స్వాతంత్ర్యం ఎంతదాకా అమలులో ఉంది! స్త్రీలో ఏ విషయాల్లోనైనా కోరుకున్నది చేసే హక్కు ఉన్నా అవకాశాలున్నాయా. ఈ కట్నాలేమిటి ఈ పెళ్లిళ్లేమిటి? ఇవన్నీ ఎవరేనా క్షుణ్ణంగా పరిశీలించ వల్సిందే.




'నాన్నా మరేమో' — నసుగుతున్నాడు వాసు.

కాంపోజిషన్ పుస్తకాలు దిద్దుతున్న వాడినల్లా ఒక క్షణం ఆపి—విసుగ్గా చూశాను వాడిని—

ఏదో అడగటానికి భయపడుతున్నట్టుగా వుంది - సూటిగా నావేపు చూడలేకపోతున్నాడు. అప్పుడే చూశాను — మెయిన్ గేటు ప్రక్కనే తారట్లాడుతున్న వాసు స్నేహితుడు శంకరంనీ... ఇంకొక కుర్రవాడినీ—

ఆ కుర్రవాడి మీద ఒక క్షణం నా చూపులు నిలిచినయి. సన్నగా పొడుగ్గా తెల్లగా ఉన్నాడు. తెల్లటి ఖద్దరు పాంటు — కొంచెం మాసినది — పసుప్పచ్చ రంగు టెరీ కాటన్ షర్టు మీద టక్ చేశాడు. వయస్సు పదిహేను సంవత్సరాలు వుండవచ్చు. కళ్ళు అమాయకంగా వున్నయి. నన్ను చూసి కొంచెం పక్కకు తప్పుకున్నాడు.

'అతనే నాన్నా రాజన్' అన్నాడు వాసు నెమ్మదిగా.

పుత్రరత్నం పెద్ద కథేదో చెప్పబోతున్నాడులా వుంది. అందుకే కాంపోజిషన్ పుస్తకాల్ని ప్రక్కకు పెట్టి — 'ఏమిటిరా నీ గొడవ.. చెప్పు' అన్నాను.

ఆ మాటతో ఉత్సాహం పుంజుకుని 'అది కాదు నాన్నా... అతను మద్రాస్ అతను —మద్రాస్‌నుంచి తిరుపతి పోతున్నాడుట— ట్రెయిన్‌లో నిద్ర వచ్చేసిందట— లేచేసరికి బెజవాడలో వున్నాట్ట. టి. సి. చూసి ట్రెయిన్ దించేశాట్ట... ఇతనేమో...'

నా ముఖంలో భావాలు మారటం చూసి ఆగాడు వాసు.

'మద్రాస్‌నుంచి తిరుపతి పోవాలంటే బెజవాడమీదుగా వెళ్ళాలిటరా పిచ్చి [illegible] — వాడెవడో భలే టోకరా యిచ్చాడు నీకు. వాణ్ణి వచ్చినదారినే వెళ్ళమను... పిచ్చి పిచ్చి వేషాలు వేయక!' కాంపోజిషన్ పుస్తకాలు ముందుకు లాక్కున్నాను.

నావేపు అదోలా చూశాడు వాసు. ఏదో యింకా చెబుదామనుకున్నాడు — అయినా లాభంలేదనుకున్నాడో ఏమో — [illegible] వంటింట్లోకి దారితీసి వాళ్ళమ్మతో చెబుతున్నాడు —

ఒక్కడే కొడుకేమో —పార్వతికి వాడంటే ప్రాణం.

లోపల్నించి మాటలు వినబడుతున్నాయి. 'మీ నాన్న మాటలకేంలే. నాయనా [illegible]

చెప్పాడూ అంతే—ఆయనలో ఏ కోశానయినా దయాదాక్షిణ్యం వుంటేనా... ఆ కుర్రవాడ్ని లోపలకు పిలు — వీడు భోంచేశాడో ఏమో—'

మా ఆవిడ మాటలకన్నా ముందుగా బయటకు దూసుకువచ్చాడు వాసు — నా వేపోసారి నిర్లక్ష్యంగా చూసి—మరుక్షణంలో శంకరంతోనూ — పదరు మద్రాస్ తంబి తోనూ నా ముందు ప్రత్యక్షమయ్యాడు—

ఇంతలో పార్వతికూడా రంగంమీదకు వచ్చింది.

'మీ నాన్న పేరేమిటి బాబూ!' అడిగింది పార్వతి.

రాజన్ కళ్ళు తుడుచుకున్నాడు. ఏమీ జవాబు చెప్పలేదు.

'రాజన్‌కి తెలుగు రాదమ్మా......' అని వాళ్ళమ్మతో అని 'రాజన్ యువర్ ఫాదర్ నేమ్ ఈజ్ వాట్' అన్నాడు ఇంగ్లీషు మాష్టారునయిన నా పుత్ర రత్నం, తన రెండో ఫారం తెలివి తేటల్ని పురస్కరించుకొని—

రాజన్ అర్థం చేసుకున్నట్టుగా తల ఊపి 'నరసింహన్' అన్నాడు.

'ఎంత బాధ పడుతున్నాడో యేమోనే అమ్మా మనం ఇవన్నీ అడిగితే!' అంటున్నాడు వాసు.

నాకు చిర్రెత్తుకొచ్చింది. తెలుగులోనే గబ గబా అనేశాను—'ఒరే రాజన్—అసలు నువ్వు ఇంట్లోంచి ఎందుకు బయల్దేరావ్? బయల్దేరిన వాడివి రైల్లో ఎందుకు నిద్రపోయావ్? నిద్రపోయిన వాడివి బెజవాడలోనే ఎందుకు నిద్ర లేచావ్? అసలు మద్రాసునుంచి తిరుపతి పోయే రైలు బెజవాడ మీదుగా ఎప్పట్నించి వెడుతున్నది? అసలు నువ్వు చెప్పేది అంతా నిజమేనా—నిజమ్మా—ఇంతకీ మీ నాన్నెవరు? ఏం చేస్తుంటాడు? నిన్నొక్కడ్ని ఎందుకు పంపించాడు—అసలు యింట్లో చెప్పే బయల్దేరావా? దొంగతనంగా పరారయావా—చెప్పు!'

నా భీకరాకారం చూసి రాజన్ ఒక్కసారిగా ఏడ్చేశాడు. శంకరం రాజన్ భుజం మీద చేయి వేశాడు. వాసు 'డు నాట్ వీప్ రాజన్' అంటున్నాడు. అప్పుడే చూశాను—రాజన్ చేతిన వున్న 'టిటోని' ఆటోమేటిక్‌ని.

# టిటోనీ

'ఎందుకండీ పిల్లవాడ్ని అదరగొడతారు, అసలే వాడు తప్పిపోయి ఏడుస్తుంటే — మీకేమన్నా 'యిది' ఉందా'—పార్వతి తన నోరును విప్పింది.

కాంపోజిషన్ పుస్తకాలు ముందుకు లాక్కున్నాను, పార్వతి నోసారి క్రీగంట చూసి.

వాసు చెబుతున్నాడు—'స్టేషన్ దగ్గర ఏడుస్తూ ఉంటే స్కూల్నించి వస్తూ నేనూ, శంకరం ఇతన్ని పలకరించామే అమ్మా—ఇతను అన్నీ చెప్పాడు. వాళ్ళ నాన్న రాజన్ తిరుపతికి వెడతానంటే యిరవై రూపాయలు యిచ్చి పంపించాడుట రాజన్ ఏమో...' తరవాత ఏమయిందో తెలీని వాసు రాజన్‌వేపు తిరిగి 'కదూ రాజన్' అన్నాడు.

రాజన్ ఒకసారి పార్వతివేపు, వాసు, శంకరాలవేపు ఆప్యాయంగా చూశాడు నా వేపు అదో రకంగా చూసి అరవంలోనే మొదలుపెట్టాడు. నాకు ప్రతి మాటా అర్థం కాకపోయినా — విషయం మాత్రం అర్థం అయింది.

తిరుపతి రైలు ఎక్కబోయి—కలకత్తా రైలు ఎక్కాడుట — బెజవాడలో దింపేశారుట—తన దగ్గర వున్న మిగిలిన డబ్బులు టి. సి. ఉంచేసుకున్నాడుట—ఫైన్ అని చెప్పి. తాను, అడుక్కు తినేవాడిని కానని—పెద్ద కుటుంబంలో నుంచే వచ్చానని, వాళ్ళ నాన్న సినిమాల్లో అసిస్టెంటు డైరెక్టర్ అని—ఇంకా చాలా చెప్పాడు. ఒక పదిహేను రూపాయలు యిస్తే తాను మళ్ళీ మద్రాసు వెళ్ళిపోతానని సహాయం చేయమనీ అడిగాడు.

అతన్ని నాలుగూ దులిపేద్దామనుకుంటున్నంతలో పార్వతి అన్నది—'సరే రాజన్ నీకు రైలు ఛార్జీలు యిచ్చి పంపిస్తాంలే గాభరా పడకు—కానీ ఈ రాత్రికి యిక్కడే ఉండు. రేపు రాత్రికి వెడుదువు గానిలే — ఇప్పటికే అనవసరంగా ఎంత హైరాన పడ్డావో!'

నేను తల ఎత్తే లోపల వాసు రాజన్‌ని తీసుకు వెళ్ళాడు.

నాకెందుకో రాజన్ చెప్పిన కథ నమ్మబుద్ధవలేదు — రోజూ యింటి నుంచి స్కూలుకి వెళ్ళేలోపల ఎంతో మంది ఏవేవో కథలు చెబుతుంటారు. అడుక్కు తినటంలో అదో అందమైన పద్ధతి మరి స్వాతంత్ర్య భారతదేశంలో, ఈ ప్రజాస్వామ్య పరిపాలనలో ముష్టివాళ్ళు ఎక్కువ. ముష్టెత్తటం సగటు భారతీయుల జన్మహక్కు. దీన్నెవరూ కాదనలేరు మరి—ఈ రాజన్‌కి పదిహేను రూపాయలు అనవసరంగా ఇచ్చేబదులు—ఏ పూర్ బాయిస్ ఫండుకో డొనేట్ చేస్తే నా పేరుతో నాలుగు క్లాసు పుస్తకాలైనా కొనుక్కుంటారు.

నా ఆలోచనలకు బ్రేక్ వేస్తూ పార్వతి అంది 'ఏమండీ పసి కుర్రవాడు పాపం — రేపు ఒక్కడ్నీ పంపిస్తే మద్రాస్‌లోనే దిగుతాడని నమ్మకం లేదు—పైగా ప్రతి వాడూ దొంగవెధవలే ఈ కాలంలో ... అందుకని ... వాళ్ళ నాన్న అడ్రస్‌కి ఒక టెలిగ్రాం యివ్వండి ఆయనే వచ్చి తీసుకుపోతాడు.'

'మధ్యలో యిదో తద్దినం ఎందుకు పార్వతీ... ఈ పూటకెట్లాగో పిల్లాడు కనుక — కాస్త తిండిపెట్టి బయటికి పొమ్మను— వాడి సంగతి మనకెందుకు'

పార్వతి గుర్రుగా చూసింది నన్ను — 'అదే మన పిల్లవాడిలా తప్పిపోతే ... మన మెంత గాభరాపడిపోతామండీ — మీ కేం ఏమాత్రం...'

కుర్చీలోంచి చర్రున లేచాను 'ఊం!

## రసరాగముల మూట

ఎలమావి గుబురులో
మధుగీతి పలికేటి
కోయిలా...........
నీ పాట రసరాగముల మూట—ఎల!
తేట తేనియల మించి
రాగ మధనా పూసి
గళమెత్తి పాడేటి
కోయిలా...........
నీ పాట రసరాగముల మూట—ఎల!
లేత చివురుల తినెడు
నీదు కంఠమ్మందు
కోటి వీణియల మ్రోత
కోయిలా...........
నీ పాట రసరాగముల మూట—ఎల!
అమృతంపు పలుకులతో
మా హృది వీణియ మీటు
కోయిలా..........
నీ పాట రసరాగముల మూట—ఎల!

—రఘు & రూప

ఆ చక్కని,
పరిశుభ్రమైన తెల్లదనానికి

# ఓ ఓ బి®
# నీలి




ఓ.ఓ.బి నీలి నీటిలో అతి సులభంగా, పూర్తిగా కరుగుతుంది. తెల్లటి దుస్తులకి సమమైన మంచులాంటి తెల్లదనాన్నిస్తుంది. మీ చొక్కాలకు, చీరలకు, దుప్పట్లకు మరియు ఇతర బట్టలకు అధికమైన తెల్లదనాన్నివ్వడానికి ఇదే అతి పొదుపైన పద్ధతి. నీలపు మరకలుండవు. పసుపు రంగుగా మారదు.

ఓ ఓ బి నీలి భారతదేశంలోకెల్లా పెద్దదైన, ఆధునికమైన ఫ్యాక్టరీలో పశ్చిమ జర్మనీవారి సహకారంతో తయారుచేయబడుతున్నది.



తయారుచేయువారు:
**అల్ట్రామెరైన్ పిగ్‌మెంట్స్ లిమిటెడ్** అంబత్తూరు, మద్రాసు-53

UPL/6546

సరే అడ్రసిమ్మను... టెలిగ్రాం యిస్తాను!' ఒకరోజు భోజనం పెడితే సరిపోతుంది. వాళ్ళనాన్న వచ్చి వాడ్ని తీసుకుపోతాడు; వదిహేనూ యివ్వాక్కరలేదు — పరకా యివ్వక్కర్లేదు.

రాజన్ తలమీద స్నానం చేసినట్టున్నాడు; తల తుడుచుకుంటూ వచ్చి అడ్రస్ చెప్పాడు.

పోస్టాఫీస్‌కి వెళ్ళి — మీవాడు మా దగ్గరున్నాడు—వెంటనే వచ్చి తీసుకెళ్ళండి —అని టెలిగ్రాం యిచ్చాను.

'ఏం ఇవాళ బంగాళదుంప వేపుడు కేశావ్ — మీ పుట్టింటి వాళ్ళెవరైనా వస్తున్నారా!'

అన్నాను ఆశపడుతూ—

'ఆఁ! మరే—మీరు తెచ్చిపడేసే ఆస్తి అంతా మూలుగుతున్నదని— తింటానికి మా పుట్టింటి వాళ్ళని రమ్మంటే వచ్చారు!' ఉరి కొంచెం వడ్డించింది మా ఆవిడ.

'అది కాదు నాన్నా! రాజన్‌కి బంగాళా దుంప వేపుడు యిష్టంట!' అన్నాడు వాసు.

పార్వతి రెండవసారి వేసిన కూరని కూడా, స్వాహాచేసి నావేపు అదోలా చూస్తున్నాడు.

వాడికి బయట వరండాలో ప్రక్క వేయమన్నా వినకుండా, పార్వతి మాతో పాటే ప్రక్క వేసింది.

నిజం చెప్పద్దూ. నాకు మాత్రం నిద్ర పట్టలేదు—వాడా రాత్రి ఏ సామాన్లు బయటకు చేరవేస్తాడో అన్న అనుమానంతో కళ్ళు తెరుచుకుని మరీ పడుకున్నాను.

నేననుకున్నట్టుగానే, అంతా సద్దుమణి గిన తర్వాత, రాజన్ నెమ్మదిగా లేచాడు అడుగులో అడుగువేసుకుంటూ. కిటికీ దాకా వెళ్ళి బయటకు చూస్తూ నుంచు న్నాడు. ఒక పావుగంట అయినా మనిషి కదల్లేదు. ఏం చేస్తాడా అని అలాగే చూస్తున్నాను నేను.

'రాజన్! నిద్రపట్టలేదా!' వాసు కూడా మేలుకునే వున్నట్టున్నాడు—అడిగాడు.

రాజన్ కొంచెం గాభరా పడ్డాడు. 'ఉహూఁ! ఉహూఁ!' అంటూ తన ప్రక్క మీదకు వెళ్ళి పడుకున్నాడు—

దొంగతనం చేయబోయే రాజన్‌ని రెడ్ హేండెడ్‌గా పట్టుకునే అవకాశాన్ని పోగొట్టిన వాసుని మనస్సులోనే విసుక్కున్నాను.

నిద్రపోకుండా అలాగే పడుకున్నాను.

ఎప్పుడు కన్నంటిందో ఏమో — చటుక్కున ఏదో శబ్దమయి మెలకువ వచ్చింది. 'ఏం రాజన్ — నిద్రపట్టలా!' అడుగుతున్నది పార్వతి.

'ఉహూఁ!' మంచినీళ్ళు తాగుతున్నాడు రాజన్.

'దాహమయిందా — నన్ను లేపక పోయావా!' అంటూనే అటు తిరిగి నిద్రా దేవి ఒడిలో ఒరిగిపోయింది పార్వతి.

ఆ చీకటిలో రాజన్ చేతి టిటోని వాచ్ రేడియం డయల్‌వల్ల తళతళా మెరుస్తున్నది. రాజన్ నిజంగానే అసిస్టెంట్ డైరెక్టర్ కొడుకేమో — లేకపోతే అంత ఖరీదైన గడియారం ఎలా పెట్టుకుంటాడు. పదేళ్ళ సర్వీసున్న నేనే గడియారం కొనుక్కోలేక పోయాను — ఎప్పుడు నిద్ర పట్టిందో తెలీలేదు.

మర్నాడు మద్రాస్‌నించి ఎవరూ రాలేదు—చీకటి పడింది— తెల్లవారింది— కాని ఎవరూ రాలేదు.

రాజన్‌ని నిలదీసి అడిగాను 'ఏరా రాజన్—ఏడి మీనాన్న?'

రాజన్ ఏమీ మాట్లాడలేదు.

'దొంగవెధవా! మా ఆవిడ తెలివితేటల వల్ల కొత్త అల్లుడులాగా రెండు రోజులూ సేవలు చేయించుకొని—కడుపు నిండా తిన్నావు—ఇకనడు — బయటికి,' పార్వతి అప్పుడే వస్తూ అన్నది 'అసలు మీరు టెలిగ్రాం యిచ్చారా—డబ్బు ఖర్చని ఊరుకున్నారా! అది చెప్పండి' నిలదీసింది.

చిన్న వచ్చినవాడు — చిక్కువయాడు పార్వతికి—కోపంగా అన్నాను — 'వాడిచ్చిన అడ్రసు కరక్టయి చస్తేకదా టెలిగ్రాం అందటానికి — ఏ సినిమా డైరక్టరీలో చూసి అడ్రసిచ్చాడో దొంగవెధవ'

పార్వతి నావేపు కోపంగా చూసింది.

వాసు 'నన్నెప్పుడూ యింతే' అన్న పోజులో వున్నాడు.

రాజన్ తాపీగా తన చేతికున్న వాచీని తుడుచుకుంటున్నాడు. వాడికి తెలుగు పూర్తిగా అర్థంకాక పోవటంవల్ల — మా బాధ వాడికి తెలిసినట్టులేదు మరి.

'ఒరే రాజన్ — నువ్వింక ఒక క్షణం యింట్లో వున్నావంటే బాగుండదు— గెటవుట్!' పెద్దగా అరచి—పార్వతిని హెచ్చరించి మరీ—స్కూలుకి వెళ్ళాను.

స్కూల్లో పని హడావిడి వల్ల ఇంటికి వచ్చేసరికే ఆలస్యమయింది—

వస్తూనే రాజన్ కోసం చూశాను. కన



వడలేదు. పార్వతిని అడిగాను.

'ఎందుకు?' అన్నది నిర్లక్ష్యంగా.

'ఎందుకేమిటి నీ మొఖం— మూడ్రోజులు నా సంపాదన తిన్నాడు—ఆమాత్రం అడిగే హక్కు లేదా నాకు!' అన్నాను.

'వెళ్ళాడు — మద్రాన్‌కి ఈ సాయంత్రమే!'

'మరి డబ్బులు?'

నా ముఖం వైపు సూటిగా చూసింది. 'నేనిచ్చాను!' అన్నది దృఢంగా.

కోపాన్ని తమాయించుకున్నాను. 'అది కాదు పార్వతీ — డబ్బు గురించి కాదు నా బాధ— అటువంటి వాళ్ళంతా దొంగ వెధవలు. మనం వాళ్ళ కథలన్నీ నమ్మి డబ్బిస్తే — వాళ్ళిక పని చెయ్యరు ఈ రకంగానే డబ్బు సంపాయించటం అలవాటు చేసుకుంటారు. అటువంటి వాళ్ళే ప్రస్తుతం మన దేశంలో ఎక్కువ. దేశ ప్రగతి ఆగిపోవటానికి సగం కారణం ఈ బద్ధకస్తులే.'

ఆ మాటలు వినటం ఇష్టం లేక కాబోలు—కాలుతున్న పోపు గింజల్లో నీళ్ళు చల్లి 'జుయ్యి' మనిపించింది పార్వతి.

సణుక్కుంటూ లోపలికి వచ్చాను. కాంపోజిషన్ పుస్తకాల ప్రక్కనే తళ తళా మెరుస్తూ—టిటోనీ ఆటోమేటిక్ వాచ్— ఈ మూడు రోజులూ రాజన్ చేతిని అలంకరించిన గడియారం కనబడింది.

నెమ్మదిగా చేతుల్లోకి అందుకున్నాను. తేరిపార చూశాను. తళ తళా మెరుస్తున్నది. ఖరీదు మూడు వందల రూపాయలని తెలుసు. పాపం! రాజన్ గడియారం మరచిపోయినట్టున్నాడు.

చటుక్కున టైము చూశాను— తొమ్మిది గంటలయింది.

రాజన్ ఎక్కిన రైలు బెజవాడ దాటి చాలాదూరం వెళ్ళి వుంటుంది.

ఆలోచించాను. రాజన్ గురించే ఆలోచించాను. నేనే అతన్ని తప్పుగా అర్థం చేసుకున్నానేమో—రాజన్ దొంగ కాదు—అతను చెప్పిన కథ నిజమే అయివుండొచ్చు—రాజన్ దొంగ అయితే చేతికి దొరికినవన్నీ మూటగట్టుకుని పోయేవాడు. మనిషిలో కూడా సంస్కారం ఉంది. అతను దొంగ అనటానికి కెందుకో నాకు మనస్కరించటం లేదు. పాపం — అంత ఖరీదు గల గడియారం మరచి పోయాడు.

మెరుపులా గుర్తుకు వచ్చింది రాజన్ అడ్రస్. రాజన్ అడ్రస్‌కి పోస్టులో పంపిస్తే!

**దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన ఆరు కథలు**

1. అమ్మా, ఆకలేస్తోందే!
2. ఎదురీత
3. పాలు
4. మనోవ్యాధికి మందు
5. మాయమనసులు
6. వాన కురుస్తే!

# టిటోని

మూడు వందల రూపాయల ఖరీదైన గడియారం మళ్ళీ దొరికితే ఎంతో సంతోషిస్తారు. పంపించాలి.

ఆలోచనలతో ఆ రోజు రాత్రి నిద్ర పట్టలేదు.

తెల్లవారిన తర్వాత లేస్తూనే — పక్కనే ఉన్న పెన్సిల్‌తో గోడమీద నూట యెనభై రూపాయలు అని వ్రాశాను. అది నా నెల జీతం.

*　　*　　*

స్టాఫ్ రూంలో కూర్చుని ఉన్న నన్ను సైన్సు మాస్టారు సుబ్రహ్మణ్యంగారు పలకరించారు.

'ఏమిటి శర్మగారూ, గడియారం కొత్తగా కొన్నారా' అంటూ—

ఒక్క క్షణం ఆయన వైపు చూశాను. కొంచెం గాభరాగా చిరునవ్వు నవ్వాను.

'అవునండీ నా మేనమామ విశాఖపట్నం నుంచి వస్తుంటే తెప్పిస్తాను. ఏమైనా అక్కడ గడియారాలు చవుకేనండీ — మొత్తం మూడొందలయింది!' అన్నాను — నా 'టిటోని' ఆటామేటిక్ గడియారాన్ని చూసుకుంటూ.

'టిటోని చాలా మంచి గడియారమండీ నా వాచ్ కూడా అదే — కాని మొన్న ఒక క్కర సధవ...' అంటూనే వెనక వున్న ఆ స్ట్రాప్‌ని పక్కకు తొలగించారు సుబ్రమణ్యం గారు.

దానిమీద పి. సుబ్రమణ్యం అని అందమైన అక్షరాలతో చెక్కి వుంది. ●

# దీపావళి కథల బాలట్ పత్రం

**దీపావళి కథల పోటీలో బహుమతి పొందిన ఆరు కథలలో నాకు ఉత్తమమని తోచిన వరుసలో ఆరు కథలు:**

| | |
|---|---|
| మొదటి కథ | |
| రెండవ కథ | |
| మూడవ కథ | |
| నాలుగవ కథ | |
| అయిదవ కథ | |
| ఆరవ కథ | |

పంపినవారి పూర్తిపేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

ఆంధ్రసచిత్రవారపత్రిక

# దీపావళి కథల బాలట్ పోటీ

## మొదటి బహుమతి రు. 250
## రెండవ బహుమతి రు. 200
## మూడవ బహుమతి రు. 150

# "నాకు నచ్చిన దీపావళి పోటీ కథలు"

**1971 దీపావళికి ఆంధ్రసచిత్ర వారపత్రిక నెలకొల్పిన దీపావళి కథల పోటీ వివరాలు ఇంతకిముందే ప్రచురించాము.**

***29-10-71 సంచికతో ఉత్తమ కథలుగా ఎన్నికైన ఆరు కథల ప్రచురణ పూర్తిఅయింది.***

ఈ ఆ[రు] కథలలో వరుసగా ఏవి ఉత్తమమైనవో నిర్ణయించి పాఠకులు ఎన్నుకునేందుకు ఒక బాలట్‌ని నిర్వహి[స్తు]న్నాము.

**బాలట్‌తోపాటు వ్యాసరచన పోటీని ఒకదానిని నిర్వహిస్తున్నాము.**

పోటీకి వచ్చిన వ్యాసాలలో ఉత్తమమైన మూడింటికి వరుసగా రు. 250 మొదటి బహుమతి, రు. 200 రెండవ బహుమతి, రు. 150 మూడవ బహుమతి ఇవ్వబడతాయి.

ఈ పోటీకి సంబంధించిన [illegible] క్రింద [illegible]న్నాము.

## ముగింపు తేది 15-11-1971

1. ఆంధ్రసచిత్రవారపత్రిక దీపావళి సంచిక [illegible] తరువాతి సంచిక (..-10-71)లలో ఉత్తమ కథలుగా ఎన్నిక అయి ప్రచురింపబడిన ఆరు కథలలో పాఠకులు తమకి ఉత్తమమని తోచిన వరుసలో మొదటి కథ, రెండవ కథ, మూడవకథ, నాలుగవ కథ, అయిదవ కథ, ఆరవ కథలని ఎన్నుకుని, తమ ఎన్నికకి కారణాలని వివరిస్తూ 'నాకు నచ్చిన దీపావళి పోటీ కథలు' అన్న శీర్షిక క్రింద ఒక వ్యాసం రాసి పంపాలి.

2. పాఠకులు తాము ఉత్తమమని నిర్ణయించిన వరుసలో ఆరుకథల పేర్లని ఈ పేజీలలో ఇవ్వబడిన బాలట్‌పత్రంలో నింపి వ్యాసంతో పాటు పంపాలి.

3. పోటీకి పంపే వ్యాసం, ఒక అరఠావు (ఎక్సర్‌సైజు పుస్తకం పేజీకి రెండురెట్లు)ని మించి ఉండరాదు. సిరాతో రాసి ఉండాలి. కాగితానికి ఒక వైపే రాసి పంపాలి.

4. ఒక బాలట్ పత్రంతోపాటు ఒక వ్యాసమాత్రమే పంపాలి. బాలట్‌పత్రాలు జతపరచని వ్యాసాలు పోటీకి స్వీకరింపబడవు.

5. ప్రతివ్యాసం వ్రాతప్రతిమీద, రాసిన వారి పూర్తి పేరు, చిరునామా ఉండాలి.

6. బాలట్‌పత్రంలో కూడా బాలట్‌పత్రం, వ్యాసం పంపేవారి పూర్తి పేరు, చిరునామా ఉండాలి.

7. కవరుమీదా, వ్యాసం వ్రాతప్రతిమీదా 'దీపావళి కథల బాలట్ పోటీ'కి అని స్పష్టంగా రాయాలి.

8. బాలట్‌పత్రం, వ్యాసం 'సంపాదకుడు, ఆంధ్రసచిత్రవారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1'కి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు.

9. పోటీ ముగింపు తేది 15—11 1971.

10. పోటీకి సంబంధించిన తుది నిర్ణయం ఆంధ్రసచిత్రవారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలూ జరపటానికి వీలులేదు.

11. ఎటువంటి పరిస్థితిలోనూ పోటీకి పంపిన వ్యాసాలు తిప్పి పంపబడవు.

12. బాలట్ పోటీ ఫలితాలు 24—12—1971 సంచిక ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురింపబడతాయి.

13. ఇంతకిముందే చెప్పినట్టు బాలట్‌లో మొదటిగా ఎన్నికైన కథకి రు. 500, రెండవదిగా ఎన్నికైన కథకి రు. 450, మూడవదిగా ఎన్నికైన కథకి రు. 400 నాలుగవదిగా ఎన్నికైన కథకి రు. 350, అయిదవదిగా ఎన్నికైన కథకి రు. 300 ఆరవదిగా ఎన్నికైన కథకి రు. 250 ప్రత్యేక బహుమతులుగా ఇస్తాము.

**పాఠకులందరూ మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.**

జ రి గి న క థ

అప్పుడే బియ్యే పరీక్షలు రాసిన కృష్ణవేణి తాతయ్య శాస్త్రిగారి టెలిగ్రాము చూచి బయలుదేరి వస్తుంది. రాజశేఖరంతో పెండ్లి చూపులు, తర్వాత వివాహం జరుగుతుంది. రాజశేఖరం చెల్లెలు మీనాక్షి మహా మూఢాచార పరాయణులు అయిన అత్తమామల ఆరళ్ళు పడలేకపోతుంటుంది. భర్త శంకరం ఆమె కన్నీరు చూడలేక సిరికివాడు. తప్పించుకుని వచ్చిన ఒక స్త్రీకి మధు తన గదిలో ఆశ్రయం యిస్తాడు. ఆమె రాణి అనే ఒక వేశ్య. ఆమె ఎడబాటుని సహించలేకపోయాడు మధు. ఆమెని వెతుక్కుంటూ బయల్దేరాడు. తన వృత్తిలోవున్న రాణి కనిపించింది. ఆమెని పెళ్లి చేసుకుంటానన్నాడు మధు. అతని నిర్ణయం ఆమెని ఆశ్చర్యపరిచింది. బ్రహ్మానందం పుణ్యమా అని రాజశేఖరానికి అన్ని దుర్వ్యసనాలూ అబ్బాయి.

# 8

అతను తూలుతూ ఇల్లు చేరుకునేసరికి పన్నెండవుతుంది. తలుపు తట్టిన శబ్దం విని శాంతమ్మ తలుపు తీసింది.

'అదేమిట్రా సినిమా కెళ్ళావా?' అంటూ లైటువేసి ఆ వెలుగులో కొడుకుని చూసి నిర్ఘాంతపోయింది.

'శే—ఖ—రం!' అంది పడం చచ్చిపోయిన గొంతుతో.

శేఖరం మనస్సులో మత్తు సగం వదిలింది.

అరమోడ్పు కన్నులతో తల్లి వంక చూశాడు.

శాంతమ్మ గజ గజ వణికిపోతున్నది. శరీరం ఒక్కసారిగా చల్లబడిపోయింది. పక్షవాతం వచ్చిన మనిషిలా కుప్ప కూలిపోయింది.

'ఎంతపని చేశావు శేఖరం?' అంది రుద్ధ కంఠంతో.

'ఏం చేశాను? తాగాను. తప్పా? తాగటం తప్పయితే మనం చేసే ప్రతి పనీ తప్పే. పై ఆఫీసరు వచ్చాడు. తాగకపోతే కల్చర్ తెలీని వాడంటారు. ఎందుకు పనికిరాని వాడంటారు.'

శాంతమ్మ కోపంతో ఒళ్ళు మరిచిపోయింది. చెంప పగిలేటట్టు ఒకటి వేసింది.

'అందుకని భ్రష్టుడవైపోతావా?'

ఆ దెబ్బతో అతని మత్తు పూర్తిగా దిగిపోయింది.

అప్రయత్నంగా 'అమ్మా' అన్నాడు.

రాజశేఖరం తల్లి వంక చూడలేక పోతున్నాడు. ఏ దౌర్బల్యంతో బ్రహ్మానందానికి ఎదురు చెప్పలేకపోయాడో, దాన్ని తలుచుకుంటే సిగ్గుతో క్రుంగిపోతున్నాడు.

'క్షమించమ్మా. ఇంకెప్పుడు తాగను.'

అతని హృదయం పశ్చాత్తాపంతో ద్రవించుకుపోతున్నది.

శాంతమ్మ కోపం అవధులు దాటింది.

'ఛీ, నా ఎదుట నిలబడకు. ఫో, వెళ్ళిపో—'

రాజశేఖరం తల వంచుకుని వెళ్ళిపోయాడు.

కొడుకు వెళ్ళినవైపే చూస్తూ నిలుచుండిపోయింది. సర్వసాధారణంగా ఏదైనా తప్పు చేస్తే శేఖరం తనంతట తనే వచ్చి తల్లి [illegible] కట్టుకుని క్షమాపణ అడిగేవాడు. ఈ రోజు?

ఇదేదో విపరీతంగా వుంది. శాంతమ్మ హృదయంలో సముద్ర మథనం జరుగుతున్నది.

ప్రాణంతో సమానంగా పెంచింది కొడుకుని. అయితే అందులో తన బాధ్యత గుర్తించలేకపోలేదు. తల్లి ప్రేమ ఆదరణతోను తండ్రి ప్రేమ బాధ్యతతోనూ కూడుకొని వున్నాయి. అది గుర్తించే తను కావలసినప్పుడు మంచినీళ్ళు చేతికి తెచ్చి ఇవ్వలేదు. ముంచుకు తాగటం నేర్పింది. అతను వేసే ప్రతి అడుగులో తన ముద్ర వుంది. కాని ఇది దేని ఫలితం? ఎవరి మహోపకారం?

జీవితంలో తను అనుభవించేదేమీ లేదు. అందరిలాగే తనకి కోరికలున్నాయి. ఈ విత్తనం వృక్షమై మూడు పువ్వులు ఆరు కాయలతో పదిమందికి నీడ నివ్వగలిగితే చాలు!

ఆ ఆశ కరిగిపోతున్నది.

శాంతమ్మని నీరసం ఆవహించింది. గుండెల్లో దడ హెచ్చింది. ఆమె మాతృహృదయం మీద ఒక్కసారి పెద్ద దెబ్బ తగిలింది. దాన్నుంచి తట్టుకోవటం చాలా కష్టం. దాన్ని మళ్ళీ అతని ప్రవర్తనే మార్చాలి. కాని అది భవిష్యత్తులో వుందా? ఎప్పుడైనా మనిషి క్షణికమైన దౌర్బల్యానికి లొంగిపోయి తప్పు చేయవచ్చు. అంత మాత్రంచేత అతని వ్యక్తిత్వం బీటలువారిపోదు. మనిషియొక్క నైతిక పతనమే పాపం!

శాంతమ్మ కన్నీటిలో క్రమంగా రాత్రి కరిగిపోతున్నది జాలిగా.

మరునాడు పొద్దున్నే లేస్తూనే కృష్ణవేణికి 'నీవు వెంటనే రా.' అని ఉత్తరం వ్రాసింది.

* * *

కృష్ణవేణి ఆ ఉత్తరం చదువుతూనే వెంటనే బయలుదేరి వచ్చేసింది. వ్రాయటమైతే వ్రాసింది కాని కోడలికి ముఖం చూపలేకపోయింది శాంతమ్మ. ఏదో తప్పు చేసిన దానిలా తల వొంచుకుంది.

'ఏం జరిగిందత్తయ్యా? ఎందుకలా ఉన్నట్టుండి రమ్మని వ్రాశారు?'

శాంతమ్మ మనస్సులో 'భగవంతుడా!'

అనుకుంది.

'...న క్షేమంగా తిరిగి వచ్చారు కదా'

శాంతమ్మ తలూపింది.

'మీనాక్షి కులాసా గదా?'

'— బాగనే వుంది.'

కృష్ణవేణికి మరేదో అడగాలనిపించినా అడగలేక పోయింది. ఆవిడేదో బాధపడు తున్నదని మాత్రం గ్రహించింది. కాని ఆ బాధకి కారణమేమిటి?

శాంతమ్మ నిట్టూర్చి వెళ్ళిపోయింది.

రాజశేఖరానికి కృష్ణవేణి వచ్చిన సంగతి తెలియదు. తల్లికి తెలిసిపోయినప్పట్నించి ఇక తారసపడదమనుకున్నాడు. మరింత సేపు భరించుకోగలిగా ... వరకు ఇంటికి గృహాన్ని ... బాగా అక్కడ దాటి రెండడుగులు వేసేసరికి వెనకాల నుంచి బ్రహ్మానందం చెయ్యివేశాడు. చాలా సేపు రాజశేఖరం సాలెగూట్లో చిక్కిన ఈగలా తన్నుకున్నాడు; కాని బ్రహ్మానందం దానికి హిప్నాటిజమ్ తెలుసేమొ? చెడులో వున్న ప్రమాదకరమైన ఆకర్షణకి లొంగి పోయాడు. తల్లికి తెలిసిపోయిన తరువాత అతని బరువు తొలగిపోయింది.

రాత్రి తొమ్మిదయినా భర్త జాడలేక పోయేసరికి కృష్ణవేణికి ఏమీ తోచలేదు. కాలుగాలిన పిల్లిలా ఇంట్లోకి వాకిట్లోకి తిరిగింది, ఆమె కళ్ళు వీధి వాకిలిని గోడ గడియారాన్ని మార్చిమార్చి చూస్తున్నాయి.

రాజశేఖరం ఇంతసేపు ఆఫీసులో ఏం తీస్తున్నాడో?

'ఆయనింకా రాలేదేం అత్తయ్యా?'

శాంతమ్మ దిగులుగా కోడలి ముఖంలోకి చూసింది.

'ఏదో జరిగింది, మీరదోలా వున్నారు. నాకేమిటో భయంగా వుంది.'

శాంతమ్మ గుండెలవిసి పోయాయి. కోడలి ప్రతి ప్రశ్న శూలంగా గుచ్చుకున్నది.

'పిచ్చిపిల్లా. ఎందుకంతభయం? నీవు స్త్రీవి. యుగయుగాలుగా స్త్రీ సహనానికి ప్రతిరూపమై నిలుస్తున్నది. ఆ స్త్రీత్వం లోని సహనమే నీకు విజయాన్ని చేకూరుస్తుంది. నీ వ్యక్తిత్వంమీద నాకు నమ్మకం వుంది. ఏం జరుగుతుంది? ఏం జరగలేదు. ఒకవేళ జరిగినా తప్పించగలను గా?'



కృష్ణవేణికి అర్థం కాలేదు.

'రోజూ ఇంత ఆలస్యం అవుతున్నదా?'

'ఆఁ!

'ఇన్నాళ్ళులేని ఆలస్యం ఇప్పుడెందుకు?'

'ఏమో? ఏ పనిమీద వున్నాడో?'

కృష్ణవేణి ఏదో అడుగబోయేసరికి 'వాడురాగానే లేపు. నాకు నిద్రవస్తోంది.' అని పోయిపడుకుంది.

కృష్ణవేణికి ఏమీతోచక వెళ్ళి పడుకుంది కాని నిద్రపట్టలేదు ఆమె గుండెల్లో గడియారం కాలంమీద వేస్తున్న దెబ్బలు ప్రతిధ్వనిస్తున్నాయి. ఆమెకళ్ళు నిశ్చలంగా భర్త ఫోటోను చూస్తున్నాయి.

సరిగా ఈ సమయానికి రాజశేఖరం 'పోతున్నాను బరమానందం' అని తేవాను తడబడుతూ

'గుడ్‌నైట్'

రాజశేఖరం నిర్మానుష్యమైన వీధుల్లో పడి తూలుతూ తనలోతను మాట్లాడుకుంటూ నడుస్తూపోగాడు

బయట భర్త వస్తున్న అలికిడివిని కృష్ణవేణి మరోవైపుకి తిరిగి పడుకుంది. ఆమెకు చిరుకోపం వచ్చింది. తను వచ్చినరోజు కూడా ఇంత ఆలస్యంగా రావటం?

రాజశేఖరం తూలుతూవచ్చి అలవాటు ప్రకారం లైటువేశాడు. పక్కమీద ఎవరో స్త్రీ పడుకోనుండటం అతనికి కోపించింది అయినా అతను ఆమెను గుర్తించలేదు.

'ఏయ్! ఎవరు నువ్వు? పరాయివాళ్ళ పక్కమీద పడుకోటం తప్పుకదూ? లే! లేచిపో!' రాజశేఖరం మాటలు ముద్దగా వున్నాయి. కృష్ణవేణి నవ్వుతూ భర్తను చూసి నిర్ఘాంతపోయింది.

'ఏమిటది? మీరు...మీరు...' ఆమెకి మాట రాలేదు.'

'నేను ఎవరా? నా పేరు రాజశేఖరం. ఈ ఇంటికి యజమానిని. ఈ ఇల్లు నాది. ఈ మంచం నాది ఈ పక్క నాది— నువ్వు లే, ఇక్కణ్ణుంచి.'

కృష్ణవేణి గొంతు దుఃఖంతో పూడిపోయింది.

'భగవాన్! మీరెంత హీనస్థితికి దిగజారిపోయారు?'

'ఏయ్! మాటలు జాగ్రత్తగా రానీయ్. హీనం హీనం అంటున్నావే? అసలు ఎవరు నువ్వు?

# అమృత కలశం

'నా పేరు కృష్ణవేణి. ఈ ఇంటికి యజమానురాల్ని.'

ఈ పేరు మంత్రంలా పని చేసింది.

'నువ్వు కృష్ణవేణివా?' కళ్ళు నులుముకొని చూశాడు.

ఆమె మాట్లాడలేదు.

అతనికి నీరసం వచ్చింది.

'ఎందుకిలా మారిపోయారు? జీవితంలో నన్నెవరూ మార్చలేరని చెప్పేవారే. మీరే ఇలా దిగజారి పోయారంటే నమ్మలేకపోతున్నాను. ఇది మన ఇంటికి మంచిదికాదు నా మాట విని నా కోసరం మానేయండి.'

అతనికి కలలోలా వినపడినయి. కాని అర్థం కావటం కష్టమైంది. అసలు అర్థం కాలేదు. నిలుచోలేక మంచం పైన బోర్లా పడ్డాడు.

'జగమే మాయ బ్రతుకే మాయ
వేదాలలో సారమింతేనయా'

అంటూ రాగయుక్తంగా పాడాడు.

కృష్ణవేణి చెదిరిన గుండెతో లేచివచ్చేసింది.

'కృష్ణవేణట. నాతో అబద్ధం చెబుతుంది. కృష్ణవేణి పుట్టింట్లో ఉంది? ఇక్కడి కెట్లా వస్తుంది?' అనుకున్నాడు.

పక్కనే పడుకుంటున్న కోడల్ని చూసి 'వాడు రాలేదా?' అంది శాంతమ్మ.

'వచ్చారు.'

'మరి—?'

'ఆయనేదో చదువుకుంటున్నారు. అందుకని ఇక్కడే పడుకుందామని—'

ఇన్నాళ్ళనుంచి దాచుకున్న దుఃఖం ఇక ఆగలేదు.

'కృష్ణా' అంది కోడలి ఒడిలో తల పెట్టుకుని.

ఆమె కన్నీళ్ళతో కోడలి ఒడినిండింది.

'ఊరుకోడత్తయ్యా ఎందుకు బాధ? ఆయనే మానతారు. చెడిపోవటం మనిషి చేతిలో వున్నదే. బాగుపడటం వున్నది. రోజులు మనవి కాకపోబట్టే ఎంతో మంచివారు అలా చెడిపోయినారు.' అంది.

కాని ఆ రాత్రంతా వేదనతో ఆమెకు నిద్రలేదు.

* * *

రాజశేఖరం మనస్సు అల్లకల్లోలంగా వున్నది. ఆ కోకుండా అతని ఉద్యోగం ఊడిపోయింది. ఇంత హఠాత్తుగా ఇన్‌స్పెక్షన్ జరుగుతుందని అనుకోలే దతను. ఇన్‌స్పెక్టర్ ధాళావంగా రాజశేఖరం బీరువా తెరిచేసరికి రెండు విస్కీ సీసాలు కనపడినయి. ఆయన ఆశ్చర్యంతో రాజశేఖరాన్ని చూశాడు — రాజశేఖరం ముఖంలో కత్తివాటు వేస్తే నెత్తురు చుక్కలేదు. పక్కనే ఉన్న ఆఫీసర్ నోటమాట రాక నిలబడిపోయాడు. ఆయనకి రాజశేఖరం మీద ఇంతవరకు సదభిప్రాయం ఉంది చిన్న వయస్సులో పైకి వస్తున్నాడని సంతోషించాడు. కాని ఇంతలో ఏమిటీ విపరీతం?

ఆఫీసులో ఒక విచిత్రమైన వాతావరణం ఏర్పడింది. గుమాస్తాలు కళ్ళతోనే గుసగుసలాడుకుంటున్నారు.

'ఏమిటిది?' అన్నాడు ఇన్‌స్పెక్టర్. రాజశేఖరం బలవంతాన మాటలు కూడదీసుకున్నాడు.

'పొరపాటైంది.'

'రాజశేఖరం, నువ్వెంతో మంచివాడవను కున్నాను. నువ్వే ఇలా మారిపోయావంటే నాకు నమ్మకం కలగటంలేదు' అన్నాడు ఆఫీసర్

'నేనీ విషయాన్ని నా రిపోరు లో వ్రాయవలసి ఉంటుంది.'

రాజశేఖరం మాట్లాడలేదు. తలవంచుకున్నాడు.

'రాజశేఖరం !'

'తప్పు చేసినప్పుడు శిక్షకి భయపడటమెందుకు? ఏం జరగాలో అదే జరుగుతుంది.'

జరగవలసినదంతా జరగనే జరిగింది.

రాజశేఖరాన్ని సస్పెండ్ చేశారు.

ఆ తరువాత అతని ఉద్యోగం పోయింది!

* * *

'అత్తయ్యా!'

'ఏమిటి కృష్ణా?'

ఇవిడపని చాలా ఇరకాటంలో పడింది. ముఖ్యంగా తల్లి బాధ చూడలేకపోతున్నది.

'నేను ఉద్యోగం చేస్తాను.'

'కృష్ణా' అంది శాంతమ్మ వ్యధతో. కృష్ణవేణి నవ్వింది.

'అవునత్తయ్యా, లేకపోతే ఎలా? కొన్ని రోజులిలా తప్పదు. దేవుడు తన ఉనికిని




ఊరికే చూస్తూ కూర్చోండి,
వయ్యారముగా మెత్తని
వా్డ్రేన్ ('టెరీన్'/కాటన్)
బట్టలతో

విశ్రాంతిగా నిలబడి, వినోదము
చూడండి! సౌఖ్యమైన మిని
దుస్తులలో హెచ్చు ఆకర్షణ ఉంది.
భారతీయ పద్ధతిలో హొ.వా.

## బోంబే డైయింగ్

మావలె మీరెవ్వరూ ఆడపిల్ల అభీష్టమును గ్రహింపజాలరు.

ప్పిరపరుచుకోటానికి మనిషికి బాధలు కల్పిస్తాడేమో ? అయినా తప్పేదేముంది.'

'ఇంత హీనస్థితికి దిగజారి పోవటమా? నా గుండెల్లో రంపంతో కోస్తున్నది. వాడిలా చెడిపోతాడని కలలోకూడా అనుకో లేదమ్మా. ఈ అవమానాన్ని భరించేకంటే ఏనుయ్యో గొయ్యో చూసుకుంటే—'

'ఎందుకలా బాధపడతారు. గతాన్ని తలిస్తే కన్నీరు తప్ప ఆనందం రాదని తెలిసినప్పుడు. మనవాళ్లే మన శత్రువుల్లా ప్రవర్తించినప్పుడు. గుండెని రాయిచేసు కోటం మంచిది కదా !'

'కృష్ణా, అది చేతకాకనేనమ్మా బాధ పడటం.'

'బాధ అనుకుంటే బాధ.'

'మీకు లేదా ?'

కృష్ణవేణి జాలిగా నవ్వింది.

'ఎందుకు లేదు, కాని బాధపడి ఏం ప్రయోజనం ? ఏం సాధిస్తాం? కొన్ని జరగవలసినవి జరిగిపోక తప్పదు. ఇప్పుడేం చేయాలో ఆలోచించాలి. ఇల్లుగడిచేదెలా?' అప్పటికే చాల ఖర్చు తగ్గించేశారు. అంత అద్దె పెట్టలేక ఒక చిన్న ఇంట్లోకి మారి పోయారు.

రాజశేఖరం మనస్సు ఒక మూలగా కుళ్ళిపోతున్నది. ఎంత నిగ్రహించుకున్నా నిగ్రహించుకోలేకపోతున్నాడు. ఉద్యోగం పోవ



టంతో తల కొట్టేసినట్లుంది. తనమీద తన మంచితనం మీద నమ్మకం పోయింది సంఘానికి. ఎలా మళ్ళీ తను మంచివాడు కావటం? ఎలా ఈ అవినీతి ఆరోపణనుంచి విముక్తి పొందటం ?

అతనికి తల్లి భార్యల సంభాషణ విన పడుతున్నది.

'నీ ఇష్టం కృష్ణా. నీకు నేను చెప్ప కర్లేదు. కాని ఆడదాని జీవితం అరి టాకు వంటిది. అది మాత్రం గుర్తు పెట్టుకో.' అంది తల్లి.

'భగవాన్.'

రాజశేఖరం రెండు చేతులలో తల పట్టుకున్నాడు.

'ఏనండీ!'

దోషిలా ముఖం దించుకు కూర్చున్నాడు.

'నే నొకటి అడగనా?'

ఏమిటి ?'

నేను ఉద్యోగం చేస్తాను.'

నువ్వా!'

'ఏం? మీ కభిమానమా ?'

'కృష్ణా!'

'మరెలా ఇల్లు గడిచేది? బాధ్యత గల వ్యక్తులు బాధ్యతని విస్మరించి ప్రవర్తిస్తే

ఇక చేసేదేముంది? ఇవాళే ఎంప్లాయ్ మెంట్ ఎక్స్చేంజిలో రిజిష్టర్ చేస్తాను.'

'నన్ను కొన్నాళ్ళు ఆలోచించుకోని.' అన్నా డతను ఆవేదనతో.

'ఆలోచించే శక్తి మీకుంటే ఇలా ఎందుకవుతారు ?'

కృష్ణవేణి గొంతు గద్గదికమైంది.

అతను కూర్చోలేక వెళ్ళి ఆకాశంలోకి చూపులు నిల్పాడు.

'జీవితంలో గెలవటం మన చేతిలో లేక పోవచ్చు. కాని మనంతట మనం ఓడి పోవటంలో అంత సంతృప్తి ఉంటుందా ? ఏమైనా మీకు మీరు తెలుసుకోవలసిందే. నేను చెప్పలేను. మీ ఆరోగ్యం గురించి మా ఆందోళన.'

'నేను మానసికంగా ఏనాడో మరణిం చాను కృష్ణా' అనుకుని ఏడ్చాడు రాజ శేఖరం. అయితే ఆ కన్నీరు ఉబికి కను రెప్పల క్రిందుగా కారింది. దాన్ని కృష్ణ వేణికి చూపించే ధైర్యం లేదు.

అతను చాలసేపు అలాగే నిలబడి పోయాడు. నిశ్శబ్దంలో, శాంతంలో లీలగా లీనమైపోతున్నాడతను. కాని మనస్సు పెరటి వాకిలి తలుపులు తెరుచుకుని పరుగెత్తింది.

'అసలా ట్రైనింగ్‌కి వెళ్ళకపోతే ఎంత బాగుండేది?'

జీవితం హఠాత్తుగా తిరిగిన మలుపు ఇది.

ఆలోచనలతో అతని తల బద్దలై పోతున్నది. నిల్చోలేక మంచం మీద వాలి పడ్డాడు. ఓడిపోయిన వాళ్ళందరికి సంతృప్తి పడటానికి వచ్చిన సమాధానమే అతనికి వచ్చింది!

'ఇదంతా కర్మ.'

అదృష్టమో దురదృష్టమోగాని కృష్ణ వేణికి బ్రహ్మానందం కంపెనీలోనే ఉద్యోగం వచ్చింది.

* * *

ఇవన్నీ ఆలోచించే మీనాక్షి పురుటి! పుట్టింటికి రానంది. తల్లి, కృష్ణవేణి గూడ వచ్చి బతిమాలారు. ఆ మాటంటే, వాళ్ళని ఇబ్బంది పెట్టదలచుకోలేదు. పైగా పక్కింటి మామ్మగారు ఎంతో సహాయం చేస్తూ తల్లిలా చూస్తున్నది.

'కొడుకా పుట్టాక అయినా మమ్మల్ని పిలు స్తావా?' పరిహాసమాడింది కృష్ణవేణి.



'అదేమిటి వదినా! పురుడొచ్చేదాకా మిరిక్కడే వుండండి.'

అన్నదేగాని ఆలోచిస్తే — అక్కడ అన్నయ్య రాజశేఖరం పరిస్థితి అది. కృష్ణవేణి ఉద్యోగం, 'ఉండాలంటే ఎలా వీలవుతుంది వాళ్ళకి?

'ఎందుకులే వదినా, అమ్మను ఆ పది రోజులు పంపించు.' అంది.

ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

'మీనాక్షి.' అంది కృష్ణవేణి.

'ఏమో వదినా, భయంగావుంది.'

'ఎందుకు భయం. ధైర్యంగా ఉండు. అంతా సవ్యంగానే వెళ్ళిపోతుంది.

తర్వాత వదిన వెళ్ళిపోయారు.

ఈ మధ్యలో సుందరం, శర్మ వచ్చి వెళ్ళారు. కాని అత్తగారు, మామగారు అసలు రానేలేదు.

అసలివ్వాళ లేచింది మొదలు ఏదోలా వుంది. ఏమిటో బడలికగా వున్నట్టుంది. మీనాక్షి పరిస్థితి చూసి శంకరం ఆదుర్దా పడిపోయాడు. ఎలాగో ఆఫీసుకి పెట్టి పంపంచి తను కాస్త విశ్రాంతిపడిపోయింది.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఇంకా కొద్ది రోజుల్లో ఈ నిశ్శబ్దమంతా చెదిరిపోయి ఇల్లంతా కేరింతలతో నిండిపోతుంది.

మీనాక్షి ముఖం విరుపెక్కింది. ఉండుండి శరీరం పులకితమైపోతున్నది. సర్వాంగములలో శంకరం నిండిపోయిన అనుభూతి. ఈ అనుభూతిలో ఎంత ఆనందం వున్నదో అంత భయం వున్నది. ఉదయించబోతున్న ఈ పాపాయి, ఎన్నాళ్ళు ఎక్కడుండో? ఎదొక గొప్ప అదృష్టం. జీవితంలో తనకేదో గొప్పపదవి రాబోతున్నది. ఈమాట తలచుకుంటేనే గుండెల్లో పూలవాన కురిసినట్లుంది.

మొదటిసారి కనుక పురుటికి పుట్టింటికి పోవాలనుకున్నది. కాని అక్కడి పరిస్థితి తలుచుకుంటేనే ఏమనుకున్నది. అంత మంచి రాజశేఖరం అన్నయ్య మారిపోయాడంటే నమ్మకం కలగటంలేదు.

మీనాక్షి కళ్ళ వెంబడి నీళ్ళువచ్చాయి.

కడుపులో ఎవరో దేవినట్టుంది.

ఆపలా ఇంటికి తిరిగి వస్తున్నది.

ఆ ఆలోచన తెగని కొద్దీ ఆమె కడుపులో బాధ ఎక్కువవసాగింది.



ఏమిటింత కదలిక?

ఒక్కక్షణం మీనాక్షికి అయోమయమని పించింది. హృదయంలో ఏదో పొంగు తున్నది.

ఏం జరుగుతున్నది? ఆయనకి కబురు చేస్తే? ఎలా చేయటం?

పక్కింటి వారబ్బాయి ఉన్నాడేమో?

కాని లేవలేకపోయింది.

గుండె దడదడ కొట్టుకుంటున్నది. ఊపిరాడనట్లయింది.

పక్కింటి మామ్మగారు అంటుంది.

'తల్లివి కాబోతున్నావు. నిన్నెప్పుడూ నవ్వుతూ ఉండాలి. మనస్సులో లేనిపోనివి పెట్టుకోకు.'

కాని ఎలా?

మీనాక్షి మనస్సు ఉత్తుంగతరంగాలతో ఎగసిపడే సముద్రమైంది.

జీవితంలో తనకి శాంతిలేదేమో? రాజశేఖరం అన్నయ్య అయినందుకు గర్వపడింది ఒకనాడు.

ఈనాడు—?

కొన్నాళ్ళు అత్తవారింట్లో తమని గురించి దిగులు. ఇక్కడ కాస్త ప్రశాంతంగా గడపదలచుకుంటే పుట్టింటిని గురించి దిగులు. ఇలా దిగుళ్ళతో తెల్లారుతుందేమో తన బ్రతుకు?

మీనాక్షి నిట్టూర్చింది. ఏమిటింత ఆయాసం?

కొంపదీసి పురుడు రాదుగదా!

డాక్టరు ఇరవై రోజులదాకా రాదని చెప్పిందే! మీనాక్షి తమాయించుకుని పడుకుంది.

మరో పది నిముషాలకు నొప్పులు ఎక్కువ కాసాగినయి.

మీనాక్షి ఆగలేక పోయింది.

'మామ్మగారు' అని కేకవేసింది.

లోపల వంట చేస్తున్న మామ్మగారు ఈ కేకవిని పరుగెత్తుకు వచ్చింది.

'నాకేమిటోగా వుంది మామ్మగారు.'

మామ్మగారు కంగారుగా లోపలికొచ్చి, తనకు తెలిసిన మంత్రసానికోసం కబురు పెట్టింది. మంత్రసాని రావటం మీనాక్షికి తెలీదు. ఆమె గుండెల్లో గుబులు దిగులు పెనవేసుకు పోయినయి.

మీనాక్షి కెవ్వున కేకపెట్టింది. ఆతరువాత ఒళ్ళు తెలీలేదు. కాని ఆమెకి ఎక్కడ్నించో లీలగా వీణానాదం వినిపిస్తూనే వుంది!

* * *

ఈ పదిరోజులు పక్కింటి మామ్మగారు ఎంతో కనిపెట్టివుంది. మీనాక్షి ప్రసవించినవార్త తెలిసిన వెంటనే శాంతమ్మ, కృష్ణవేణి వచ్చారు. కృష్ణవేణి వెంటనే వెళ్ళిపోయింది. శాంతమ్మ ఉండిపోయింది. అయినా మామ్మగారి సహాయం మాత్రం మరిచిపోలేనిది. ఆవిడకెంతైనా ఋణపడ్డాననుకుంది, మీనాక్షి. దంపుడు బియ్యంతో తనే పథ్యము వండి తెచ్చేది.

బారసాలకి శివనాథం, నరసమ్మ, శర్మ, సుందరం వచ్చారు. రాజశేఖరం రావటానికి ముఖం చెల్లలేదు. భర్తనివదిలి రావటానికి కృష్ణవేణికి వీలు కలుగలేదు.

ఈ అవకాశాన్ని నరసమ్మ బాగా ఉపయోగించుకుంది.

'రావాలంటే మాటలా? ఉద్యోగాలు చేసేవాళ్ళకి శలవ దొరకదూ? మనం గనుక, శలవ గిలవ కోరక్కర్లేదు కనుక, పరుగెత్తుకు వచ్చాం, అందరు అలా రాదలా?' అంటూ కసి వెళ్ళగ్రక్కింది.

అంతా వినబడుతున్నా శాంతమ్మ నోరు మెదపలేదు. మీనాక్షి వినబడనట్లే నటించింది. సుందరం కల్పించుకుంది.

'వచ్చినవాళ్ళ సంగతి చూద్దాం. రాని వాళ్ళసంగతి ఎందుకమ్మా?'

'అవునులే, నువ్వు వాళ్ళతో కలిశావన్న మాట. ఇహ అయినట్టే—' మూతి ముప్ఫయి మూడువంకలు తిప్పింది,

అంతటితో ఆవిడ ఊరుకోలేదు. ఆ రోజంతా ఆవిడ నోరు మూతపడలేదు. ఎవరిమటుకు వారు ఆవిడ్ని పట్టించుకోటం మానేశారు. అది మరీ కష్టమైంది.

ఈ కోపం పేరుపెట్టేటప్పుడు తారస్థాయి నందుకుంది. దానికి కారణం లేకపోలేదు. ఎవరిపేరు పెట్టాలన్నప్పుడు నరసమ్మ తన భర్తపేరు పెట్టాలని ఆశించింది. దాన్నిగురించి అంతకుముందు సుందరంతో, శంకరంతో ప్రస్తావించింది. అయితే శంకరానికి బ్రతికున్న వాళ్ళపేరు పెట్టటం ఇష్టంలేదు. ఆమాట పైకి అంటే రగడ చేస్తుందని అప్పటికి మెదలకుండా వూరుకున్నాడు. సరిగా నామకరణ మప్పుడు పురోహితుడు ఉంగరం ఇచ్చి పళ్ళెంలో బియ్యం పోసి పేరు వ్రాయమన్నప్పుడు మౌనంగా గోపాలకృష్ణమూర్తి అని వ్రాసేశాడు. మీనాక్షి ముఖం మనోహరంగా వెలిగింది.

ఆ పేరు చెవిన పడగానే నరసమ్మకు నన నాడులు కృంగిపోయినంత బాధ కలిగింది. అవమానంతో మనస్సు పచ్చిపుండు లాగా అయింది. దాని మీద శాంతమ్మ ముఖంలో వెలిగిన చిరునవ్వు కారం చల్లినట్లయింది. ఇంతకూ ఆ పేరు శాంతమ్మ భర్తది. ఆ అవమానం సహించాల్సిందేనా? అమ్మమ్మ! ఎంతకు తెగించారు? ఆ కోపంలో ఆశీర్వదించటానికి పురోహితుడు ఇచ్చిన అక్షతలు వేయనేలేదు.

'నువ్వు ఆశీర్వదించమ్మా' శంకరం వొంగడు

శంకరం, తన కొడుక్కు లంకా నోట్లో వేలు పెడితే కొరక లేనివాడు — ఎంత మారాడు!

'మా ఆశీర్వాదా లెందుకులే పెట్టాల్సిన వాళ్ళకి పెట్టించు నమస్కారాలు' అన్నది.

'అదేమిటత్తయ్యా, మీ తరువాతనే మా కెవరైనా' అంది మీనాక్షి.

'ఆఁ, చెప్పకుంటే పిచ్చి చేటు. ఆ గౌరవం కనబడుతూనే వుంది. హయ్యోరామ! ఇంతకూ చేసుకున్న వాళ్ళకి చేసుకున్నంత మహదేవ!'

'ఇప్పుడేమయిందమ్మా?' అంది సుందరం.

'ఇంకా ఏం కావాలి? లేకలేక ఇన్నాళ్ళకి ఇంట్లో పసి నలుసు కలిగింది కదా, మీ నాన్న పేరు పెట్టాలని, నోరారా పిలవాలని ఎంత మనసు పడ్డానో? నాలాంటి దానికి కోరిక లుండటం కూడానా? నా కడుపున పుట్టిన కూతురుకూడ వాళ్ళ పక్షమే చేరిపోయె. ఇహ నామీద గౌరవం వుంటుందా? ఇంతకూ చేసుకున్న వాళ్ళకి చేసుకున్నంత మహదేవ! పెద్దవాళ్ళ పేరు పెట్టటం శ్రేయస్కరం!

ఇంత సేపు శివనాధం కొడుకు తనకు చెప్పిన బట్టలు చూసుకోటంలో మునిగి పోయాడు. భార్య మాటలు విని తను

అందుకొన్నాడు. శివనాధం నోరు విప్పితే మరీ ఘోరం. నోటికేవచ్చేది ఆయనకే తెలియదు.

'ఎందుకే, కొడుకులు. బట్టలు తెచ్చాడు చూడు. నా ముఖానల్లే వున్నాయి. మధ్యకి జరీపోగన్నా లేదు.'

'సరేలెండి. వీళ్ళేదో మిమ్మల్ని ఉద్ధరిస్తారనుకున్నారా?' అన్నది నరసమ్మ.

తను లేచిన వేళెత్తి చూపించే సరికి శంకరానికి కష్టమేసింది. మీనాక్షి కళ్ళు తుడుచుకొంది.

'ఏమిటమ్మా, శుభమా అని వాళ్ళు బారసాల చేసుకుంటుంటే మధ్య నీ సాధింపు' అంది సుందరం.

'అవునే. నేనో అశుభ పక్షిని. అందుకే రానన్నాను. నాకు తెలుసు — నా కొడుకు ఎవ్వెరిదో సురిచిపోయాడని. ఈ మహాతల్లి ఏ మందో మాకో పెట్టి వాడ్ని వశపరచుకున్నదని. నా వాళ్ళకి నేను కాకుండా పోయినాక నేనెందుకిక్కడ? ఇన్ని నీళ్ళు వదిలి పెట రా— బ్రతికుండగానే చూస్తాం.' అంది కోపంతో ఊగిపోతూ.

'పోనీలే, పిడ్డి శివగోపాలకృష్ణమూర్తి అని పిలుచుకుంటాములే' అన్నాడు శంకరం.

మాటతో ఆవిడకి శివమెక్కింది.

'ఎందుకు నాయనా, మా కళ్ళ నీళ్ళు తుడవటం. ఇంతకూ చేసుకున్నవాళ్ళకి చేసుకున్నంత మహదేవ!'

'పోనీలే, పిడిమీద రెండక్షింతలు వేయి. వీళ్ళమీద కోపం వాడిమీద చూపించటమెందుకు?' అంది సుందరం.

'ఇంత సేపట్నించి వేసిందిగా' అన్నాడు శర్మ.

శర్మ రావటంతో వాతావరణం కాస్త చల్లబడింది.

ముఖం మరోవైపుకి తిప్పి 'నువ్వయినా నూరేళ్ళు బ్రతకరా నాయనా' అని వాడి మీద అక్షింతలు వేసింది.

అయితే ఇంతవరకు ఆవిడకి తట్టని గొప్ప విషయం మరొకటుంది. సుందరం తన నలుగురు కొడుకులలో ఒకరికైనా శివనాధం పేరు పెట్టనేలేదు.

(ఇంకా ఉంది)

# ఇతరులకు చెప్పకూడనివి



బులుసు వెంకటరమణయ్య ★ ధర్మపథం

★ ఎంత ఆప్తులైనా సరే — వారికి కూడా చెప్పకుండా దాచదగినవి కొన్ని ఉన్నవి. నీతిచంద్రికలో చిన్నయసూరి గారు — అర్థనాశం, మనస్తాపం మొదలయిన కొన్నిటిని మాత్రం చెప్పారు. కాని దాచి ఉంచదగినవి తొమ్మిదని విద్వాంసులు చెప్తున్నారు—

'ఆయుర్విత్తం గృహచ్ఛిద్రం
మంత్రమౌషధ సంగమౌ,
దాన మానావమానాశ్చ
నవ గోప్యా మనీషిభిః.'

'ఆయుస్సు, ధనం, కుటుంబంలోని కీచులాటలు, మంత్రం, ఔషధం, ఇతరులను కలుసుకుని మాటలాడిన విషయం, ఇతరులకిచ్చే దానం, తనకు ఇతరులుచేసిన మర్యాద, తనకు కలిగిన అవమానం — ఈ తొమ్మిదింటినీ ఇతరులకు విద్వాంసులు చెప్పకూడ'దని దీని అభిప్రాయం.

వయస్సును కొంతదాచి—అంటే కొంత తగ్గించి చెప్పడం ఆచారంలో ఉన్నది. ఉన్న వయస్సును ఉన్నట్టుగానే చెబితే వివాహాదులలోనూ, ఇతర విషయాల్లోనూ చిక్కులు కలిగవచ్చు. సరియైన వయస్సు చెప్పక పోతే — దాన్ని ఇచ్చవచ్చినట్టు మార్చుకో దానికిన్నీ అవకాశం ఉంటుంది.

వయస్సు దాచినట్లే — దగ్గర ఎంత ధనం ఉన్నదో చెప్పకుండా ఉండడం సహజం. ధనం ఉన్నట్టు తెలిస్తే — ఎంతమంది పీక్కుని తింటారు. ధనం లేనట్టు తెలిస్తే — అటువానికి అప్పు పుట్టదు.

ఇంటి విషయాల్లో ఏవో అభిప్రాయభేదాలు, చిన్న చిన్న కలహాలు ఉండవచ్చును. అవి నలుగురికీ తెలిస్తే — నలుగురిలోనూ ఉండే మంచిపేరు దెబ్బతింటుంది.

ఏదయినా మంత్రం వేసేటప్పుడు ఆ మంత్రాన్ని బయటికి ఉచ్చరిస్తే ఆ మంత్రం విలువ పోతుంది. అది పని చెయ్యక పోవచ్చు. మంత్రంమీది గౌరవం నశిస్తుంది.

వైద్యుడు రోగికిచ్చేమందు విలువ తక్కువదీ, అందరికీ తెలిసేదీ కావచ్చు అయినా 'అది ఫలానా మందు' అని వైద్యుడూ చెప్పకూడదు. 'ఏం మందు ?' అని రోగీ అడగకూడదు. తెలిస్తే 'ఇదేనా ? ఏమో అనుకున్నాను' అనే నిరసనభావం, అందువల్ల అది పనిచెయ్యకపోవడం ఇటువంటి అనర్థాలు కలుగుతాయి.

ఈ విధంగానే ఏదో కార్యం నిమిత్తం ఎవరిని కలుసుకున్నా, లేదా— స్త్రీ సంగమాన్ని గురించి అయినా బయటికి చెప్పకూడదు.

ఇతరులకు దేన్ని ఇచ్చినా దానం చేసినట్టు గొప్పగా చెప్పుకోకూడదు. అందువల్లనే ఉత్తములు గుప్తదానాన్ని చేస్తారు. ఏమి ఇచ్చినదీ ఎవ్వరికి తెలియకుండా ఇస్తారు. అది నిరాడంబరత్వానికి గుర్తు.

ఇట్లే తన్ను ఎవ్వరైనా గౌరవించినా 'ఇంత గొప్ప గౌరవం పొందాను' అని చెప్పకూడదు. అది అహంభావాన్ని సూచిస్తుంది.

ఇతరులు తనను అవమానించినా—ఏమీ ఎరగనట్టు ఊరికే ఉండాలి — కాని పదుగురితో చెప్పరాదు. తెలియకుండా ఉన్నంతకాలం తన మనస్సుకే ఎక్కువ బాధ కలుగదు. తెలిస్తే నలుగురిలో నవ్వులపాలు—అంతులేని విచారమున్నూ.

అందువల్ల ఈ తొమ్మిదింటినీ గుప్తంగా ఉంచడం మేలు. ●

లాగా వుంది రాజారాంకు.

అప్పుడే క్రొత్తగా ఏం. యస్సి. పాస్ అయి ఆ కాలేజీకి కెమిస్ట్రీ లెక్చరరుగా వచ్చాడు రాజారాం. సహజంగా ఆడపిల్లలకు దూరంగా వుండే మనస్తత్వం కావడం వల్ల, క్లాసులో ఆడపిల్లలమీద ఎక్కువ యింటరెస్టు తీసుకునేవాడు కాదు. పైగా వయసొచ్చిన ఆడపిల్లల్ని మగపిల్లల ఎదుట ఏదైనా ప్రశ్న అడిగితే ఏ కారణం వల్లనైనా దాని వారు జవాబు చెప్పలేకపోతే ముందు తనే బాధపడేవాడు రాజారాం. 'ఎందుకు అడిగారా?' అని. అల్లాంటి కష్టం యిటు తనకూ లేకుండా అటు ఆడపిల్లలకూ లేకుండా వుండాలని వాళ్ళని అసలు ప్రశ్నలే అడగడం మానేశాడు. తనకు అప్పుడు మహా వుంటే యిరవైమూడేళ్ళు వుండేవి ఒకవేళ తను వాళ్ళమీద ఎక్కువ యింటరెస్టు తీసుకుంటే లేనిపోని గొడవలు ఎక్కడ వస్తాయోనని చివరికి లెక్చర్ యిచ్చేటప్పుడు కూడ వాళ్ళవైపు ఎక్కువగా చూచేవాడు కాడు రాజారాం.

కాని రాజారాం ప్రవర్తనని అమ్మాయిలు నిర్లక్ష్యంగా భావించారు. ప్రశ్నలు అడగకుండా, తమవైపు చూడకుండా పాఠం చెప్తూవుంటే అమ్మాయిలకు అసలు అర్థమే అయ్యేదికాదు. రామరామ కెమిస్ట్రీ, అంటేనే యింటరెస్టు లేకుండా పోయింది గరల్ స్టూడెంట్సుకు.

కాని చదువంటే ఎక్కువ ఆసక్తి, ముఖ్యంగా పెట్టుదలగల రాధిక వూరుకో లేక పోయింది. సహజంగానే ధైర్యవంతురాలు: పైగా కమీషనర్ కూతురు. పి. యు. సి. అమ్మాయిల కందరికీ లీడర్‌లా వుండేది. ఒకరోజు క్లాసులో ధైర్యంగా లేచి నిలబడింది, 'ప్లీజ్ ఎక్సు క్యూజమీ మాష్టారూ' అంటూ.

క్లాసులోకి వస్తూనే అటెండెన్సు అయినా తీయకుండా సీరియస్‌గా లెక్చర్ క్లాసు మొదలెట్టిన రాజారాం రాధిక ఎందుకు లేచిందో తెలియక పైగా ఆవిడ లేచినందుకు కాస్త యిబ్బందిగా ఫీలవుతూ 'వాట్ డు యు వాంట్ మిస్' అని అడిగాడు.

మాటిగానే చెప్పేసింది రాధిక.

'నేనిలా చెప్తున్నందుకు క్షమించండి మాష్టారు. మీరు అబ్బాయిలమీద ఎంత యింటరెస్టు తీసుకుంటున్నారో మామీద కూడ అంతే యింటరెస్టు తీసుకుంటే మాకు బావుంటుందండీ. లేకపోతే మాకు మీ క్లాసు అంటేనే ఏదో విధంగా వుంటూ వుంది మాస్టారు' అంది రాధిక.

రాధిక మరీ అంత నిర్మొహమాటంగా, నిర్భయంగా అంత పెద్దక్లాసులో తనను విమర్శించేసరికి యిబ్బందిగా ఫీలవడమే కాక సిగ్గుకూడ వేసింది రాజారాంకు.

మళ్లీ రాధికే అంది.

'మిమ్మల్ని విమర్శించా లనుకోవడంలేదు మాస్టారు. మీరు క్వశ్చన్సు అవీ మమ్మల్ని కూడ అడిగితే బావుంటుంది చదువుకోడానికి.'

రాజారాంకు లెక్చరరుగా తన కర్తవ్యం అప్పుడు గుర్తొచ్చింది.

'అయామ్ రియల్లీ వెరీవెరీ సారి మిస్. యిప్పట్నుండి నా కర్తవ్యాన్ని నేను నిర్వహిస్తాను' ఆఫీసరుముందు తప్పు చేసిన సైనికుడిలా చెప్పాడు రాజారాం.

'థ్యాంక్యూ మాస్టారూ' అంటూ కూర్చుంది రాధిక.

తరువాత ప్రత్యేకంగా డిపార్టుమెంట్‌కు వచ్చికూడ. క్షమాపణలు చెప్పుకుంది, వాళ్ళ కష్టాలుకూడ చెప్పుకుంది నిర్మల మనస్సుతో.

ఆ కాలేజీ వచ్చి అప్పటికే రెండు నెలలకి పైగా అవుతున్నా ఆరోజే మొదటి సారిగా రాధికతో అలా పరిచయం అయ్యింది రాజారాంకు.

నో లెక్చరర్ను పట్టుకొని అంత నిర్భయంగా అంతపెద్ద క్లాసులో విమర్శించిన రాధిక ధైర్యానికి కాస్త ఆశ్చర్యపడ్డా సంతోషించాడు రాజారాం.

లెక్చరరగా తన కర్తవ్యాన్ని ఏవేవో ఆలోచనలతో తను నిర్లక్ష్యంచేసి మర్చిపోయినపుడు సదుద్దేశంతో స్టూడెంట్ గుర్తు చెయ్యడంలో తప్పు లేదనుకున్నాడు రాజారాం.

అలా రాజారాం ఆలోచన సరిధిలోకి వచ్చిన రాధిక, ఫస్టు టరమ్ పరీక్షలో ఫుల్ పి.యు.సి. క్లాసు కంతటికీ కెమిస్ట్రీలో ఫస్టు మార్కు తెచ్చుకోవడంతో రాజారాంకు అభిమాన స్టూడెంట్ అయ్యింది రాధిక.

రాధిక కూడ ముందు ముందు తన కేమన్నా డవుట్సువస్తే క్లాసులోనే అడిగేది. తరువాత తరువాత డిపార్టుమెంట్‌కు వెళ్ళేది. చివరికి అప్పుడప్పుడు రూముకూడ వెళ్ళేది.

చివరికీ యిద్దరి పరిచయం హృదయాల్లో దోబూచులాడే ప్రణయంగా మారి పోయింది. తన హృదయంలోని ప్రేమను రాధిక ముందు వ్యక్తపరిచేంత ధైర్యం రాజారాంకు లేకపోయింది. అందుకోసం హృదయంలోనే దాచుకున్నాడు రాజారాం.

ఇక రాధిక సరేసరి. తాను ధైర్యవంతురాలినని యింకోసారి నిరూపించుకుంది. రాధిక వెడుతూంటే పోకిరబ్బాయిలు ఏడ్పించాలనే వుద్దేశంతో 'రాధికా రాజారాం' అనో 'రాధికారాజా' అనో లేకపోతే 'రాజారావు గారు' అనో యింకా యింకా తమకు యిష్టం వచ్చినట్టు వాగేవారు. ఆ మాటలు సూటిగా వచ్చి తన చెవుల్లో దూరుతున్నా నిర్లక్ష్యంగా విని వెళ్లిపోయేది.

రాధిక నిర్లక్ష్యంతో విసిగిపోయిన అబ్బాయిలు క్రొత్త ఆయుధం సృష్టించారు. రాజారాం పేరుతో రాధిక అందాన్ని చిలువలు పలువలుగా కల్పించి ఓ వుత్తరం రాధిక పేర వ్రాశారు.

ఉత్తరం అందుకున్న రాధిక ఏమాత్రం సంకోచించకుండ ప్రిన్సిపాల్‌గారి కిచ్చి వివరి స్థితినంతా వివరించి చెప్పింది. ఫలితంగా ఆ పోకిరి కుర్రాళ్ళు డిస్మిస్ అయ్యారు. రాధికకు తెలియకుండా రాజారాం కూడా ఓ చిన్న వార్నింగు లభించింది.

కాని ఆడపిల్ల తండ్రికావడం మూలాన్న విషయమంతా తెలుసుకొని పరిస్థితి చెయ్యి దాటిపోక ముందే ట్రాన్స్‌ఫర్‌కు ప్రయత్నం పెట్టుకున్నాడు రాధిక తండ్రి.

పరిస్థితులన్నీ యిలా గందరగోళంగా వుండటం మూలాన రాధికకు మచ్చరాకుండా వుండాలంటే తను దూరంగా వుండటమే మంచి భావించాడు రాజారాం. పి. యు. సి. పబ్లిక్ పరీక్షలు యింకో నెలే వున్నాయి. ఈ విషయాలన్నీ మర్చిపోయి రాధిక చదువులో లీనమయి పోవాలంటే తప్పనిసరిగా తను దూరంగా వుండాలనుకున్నాడు రాజారాం. మాడోకంటికి తెలియకుండా లాంగ్ లీవు పెట్టేసి వెళ్ళిపోయాడు రాజారాం వ్యధిత హృదయంతో. అంతే. మళ్ళీ నుత నచ్చి చేరేసరికి రాధికావాళ్ళు యింకో వూరికి

వెళ్ళిపోయి చాల నెలలైపోయింది. ఆ తరవాత మళ్ళీ రాధిక సంగతి వినడం ఇప్పుడే......

ఆలోచనల్లో ఎప్పుడో తెల్లవారిపోయినా నిద్దరకుగా అలాగే పొర్లసాగాడు రాజారాం. ముందు కాలేజీకి వెళ్ళకూడదనుకున్నాడు గాని రాధికను చూడాలన్న కోరిక బలంగా కలిగేసరికి వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు.

అద్దం ముందు నిల్చొని క్రాపు దువ్వుకుంటూ వుంటే పదమూడేళ్ళ క్రిందటి రాజారాం గుర్తుకొచ్చాడు. ఆకర్షణీయమైన విగ్రహంతో, నొక్కు నొక్కుల జుట్టుతో ఎంతో అందంగా వుండేవాడు ఇరవై మూడేళ్ళ రాజారాం. ఈనాడు విగ్రహంలో వయసువల్ల కలిగే కొద్ది మార్పు తప్ప ఇంకేమీ లేకపోయినా, ఆనాటి చలాకీతనం, ఆకర్షణా లేదు కళ్ళలో. కాని వాటి స్థానే జరిగిన పదమూడేండ్ల అనుభవ ఛాయలు వున్నాయి. జుట్టు కాస్త నెరిసినా

# రాధిక

అక్కడక్కడ వయసు పెరిగింది అనేదానికి నిదర్శనంగా. నవ్వుకుంటూ కాస్త వుత్సాహంగానే బయలుదేరాడు రాజారాం కాలేజీకి.

తీరా కాలేజీకి వెళ్ళి సాయంత్రం కావస్తూ వుంటే రాజారాం మనస్సులో ఇంకో రకమైన ఆలోచనలు రాసాగాయి.

'తన పిచ్చిగాని రాధిక తనలా యింకా తనను జ్ఞాపకం పెట్టుకొని వుంటుందా? ఒకవేళ జ్ఞాపకం వున్నా 'మాస్టారు' అంటూ పదమూడేళ్ళ క్రితం జరిగిన గతాన్ని తలచుకొని పలకరించగలదా? ఎంత సైంటిస్ట్ అయినా రాధిక స్త్రీనే. ఇప్పటికి పెళ్ళి అయిపోయినా అయిపోయి ఉండవచ్చు. కాకపోయినా ఏ ఫారిన్ రిటర్న్‌డ్ వరుడో నిర్ణయించబడి ఉంటాడు. అలాటి భర్తను కాదని ఎప్పుడో వయసు చిగురించిన క్షేత్రంలో ఓ వ్యక్తిమీద కలిగిన మధుర భావాలు సమసిపోకుండా అలాగే ఉంటాయా? ఒకవేళ వున్నా లాంఛనంగా 'మాస్టారూ' అని పలకరించవచ్చు. ఒకవేళ పలకరిస్తే గతంలోని తమ అనుబంధం మరీ ఎక్కడ బయటపడుతుందోనని ఎరిగి ఎరగని దానివలె ఉండిపోనూ ఉండవచ్చు.'

రాధికను చూడకుండానే వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాడు రాజారాం, అర్జంటు పని ఉందని చెప్పి. ఇన్నేళ్ళ అనుభవంతో రాజారాం కెమిస్ట్రీ డిపార్టుమెంట్‌కు 'హెడ్' అయ్యాడు.

'ఆ వచ్చే ఆవిడకు పూర్తిగా కాకపోయినా సగానికి సగం మీ సబ్జెక్ట్‌తో టచ్ ఉంది. అలాంటప్పుడు మీరు లేకపోతే ఎలాగండీ రాజారాంగారూ? మీరు తప్పకుండా ఉండవలసిందే' అన్నారు ప్రిన్సిపాల్‌గారు.

నాలుగయ్యేసరికి కాలేజీ ఆవరణలోకి 'బయో కెమిస్ట్ రాధికారాణి' కారు దిగింది. ముందు కమిషనరు దిగారు. వెనకటికన్నా ఇప్పుడు చాల [illegible]లా కన్పిస్తున్నారు. ఆయన వెనుకనే రాధికారాణి దిగింది. ప్రిన్సిపాల్ గారెళ్ళి ఎదురై సాదరపూర్వకంగా చిరునవ్వుతో ఆహ్వానించారు ఇద్దర్నీ.

ఒక సంవత్సరంపాటు తనకెంతో పరిచయమయిన కాలేజీ ఆవరణనంతా కలయజూస్తూ నవ్వుతున్న రాధికారాణిని చూడగానే ఒక్క క్షణం ఆశ్చర్యపోయాడు రాజారాం.

ఆనాటి రాధికెక్కడ? ఈనాటి ఈ రాధికారాణి ఎక్కడ? గాలిలో ఎగురుతున్న ఉండే ఆ పొట్టి రెండు జడలు, బుట్ట బొమ్మకు కట్టినట్లు ఉండే ఆ బుట్ట పరికిణీ, గాలిలో ఎగిరెగిరిపోతూ ఉండే పమిటను అదుపులో పెట్టలేక అవస్థపడుతూ సతమతమవుతూ, కోపించిన పాఠం దరికి పేకు పెడుతూ ఉండే ఆ చిలిపి కళ్ళ రాధి కెక్కడ? తెల్లటి జరీ చీర నిండుగా భుజాల చుట్టూ చుట్టుకొని, నిండైన నగ చుట్టుకొని ప్రిన్సిపాల్ గారికీ, కమిషనర్ గారికీ మధ్యలో గంభీరంగా వచ్చే ఈ రాధికారాణి ఎక్కడ?' అనుకున్నాడు రాజారాం మనస్సులోనే.

ఆనాటి రాధికను చూసిన ఏ మగవాడూ గంభీరంగా ముందుకు పోలేడు. ఈనాటి రాధికారాణిని చూస్తే ఎంతటి చిలిపి మగవాడు కూడా పూజ్యభావం కనపరచగలడు.

## ఉపాధి

పాటాలు నేర్పని చదువులు
పనికిరాని విద్యలు
వెల్లవూలిన ఖర్చులు
ఎల్ల వేళల బాధలు.
బి. ఏ. లు చదివినా,
బి. ఇ. డిగ్రీలు పొందినా
ఎమ్. ఏ. లు చదివినా,
ఎం.బి.బి.ఎస్. పట్టాలు పొందినా
కష్టపడి పనిచేయందే
కాళ్ళు చేతులు కదపందే
వస్తుందా నెల జీతం?
గడుస్తుందా జీవితం?
నాగలి మంచిదైతే
దున్నగలదా తనకై తానే?
పారగట్టిదైనా
త్రవ్వగలదా తనకై తానే?
డిగ్రీలు పంక్తులు పొడవున్నా
తెచ్చిపెట్టగలవా పెం జీతాలు?
కావాలి కావాలి అంటాము అభివృద్ధి
శరీరాన్ని వంచి శ్రమిస్తే కాదా అభివృద్ధి?
కుర్చీపై కూర్చొని కట్టలు కట్టలు
రాసేస్తే వస్తుందా అభివృద్ధి?
సభల్లో ఉపన్యాసాలు దంచేస్తే సమ
కూరునా అభివృద్ధి?
పనిచేసే దొక్కరు, వంచుకు తినేది పదిమంది!
సంపాదించే దొక్కరు, సంతర్పణకు చాలా
మంది!

దినానికున్నాయి ఇరవై నాలుగు గంటలు
ఆరుగంటలు హాయిగా నిద్రింతుం.
మరో ఆరుగంటలు ఇతర సల్లాపాలకు,
పోగా మిగిలిన పన్నెండు గంటలు ఏం
చేస్తున్నాం?
పోస్తున్నాం భాగ్యం పొయ్యిలో
చూస్తున్నాం జపాను, జర్మనీలను
పోనీ నేర్చుకుంటున్నామా బ్రతుకు తెరువు
పాఠాలను?
మనుగడ నేర్వలేని మనుషులమా? రాతి
బొమ్మలమా?
కండబలిమి కలవాడు కూడా
ముందుకొస్తాడు ముష్టి చిప్పతో!
పనిచేసుకుని బ్రతకవయ్యా అంటే,
'ఎక్కడుంది బాబు పని' అంటాడు గుడ్డి
వాడిలా
పని చెయ్యమంటె భగ్గున మండిపడతాడు
ముష్టి వాడినుండి పోష్టు గ్రాడ్యుయేట్
వరకు!
పనిచెయ్యాలి ఉపాధి కావాలంటె
కలుగునా ఉపాధి కండ్లు మూసుకూ
ర్చుంటే?
ఉపయోగించాలి మన శక్తిని, బలిమిని,
ఉపాధి కల్పించుకోవాలి స్వయంకృషితో.

—ఎల్. మాలకొండయ్య

"ఆడవాళ్ళలో ఇంతలో ఇంత మార్పు" అనుకొన్నాడు రాజారాం.

ప్రిన్సిపాల్ గారు ఒక్కొక్క స్టాఫ్ మెంబరుకీ పరిచయం చేస్తూ వస్తున్నారు రాధికారాణికి. అలవాటు ప్రకారం 'మీరు— ప్రొఫెసర్ వి రాజారాంగారు' అని పరిచయం చెయ్యబోయారు.

చిన్నగా నవ్వుతు మధ్యలోనే అడ్డుతగించి రాధికారాణి 'మీరు పరిచయం చెయ్యక్కరలేదండీ సార్, నే నిక్కడ చదివాను అనేదానికి సాక్ష్యం 'ఈ నాగస్వామి గారు' అంటూ తనే పరిచయం చేసి 'నమస్కా

...ండీ నమస్కారం, జ్ఞాపకం వున్నానండీ' అంది

అంతవరకు ఏమిటో ఆలోచిస్తున్న

## రాధిక

రాజారాం కాస్త కంగారుపడుతూనే నవ్వుతూ 'నమస్కారము...వస్తా' నే శాగ్ర మిగతా లెక్చరర్ని అనుకరిస్తూ. గొంతులో ఏదో అడ్డు పడినట్టు కీచుమంది. తన మాటలూ, తన కంఠస్వరమూ తనకే క్రొత్తగా విచిత్రంగా వినిపించాయి.

రాజారాం మాటలకు ఫక్కుపడి [illegible] తిరిగి విచిత్రంగా అంతకంటే సూటిగా రాజారాం కళ్ళల్లోకి చూసింది రాధిక. మెల్లిగా [illegible] మరచిపోయాడు రాజారాం.

రాధికారాణి స్పీచ్ అంతా [illegible] చివరికి టీచింగ్‌పార్ట్ మీద నో రెండు ముక్కలు చెప్తూ క్రొత్తగా చేరిన మగ లెక్చరరు, విద్యార్థినులకు భయపడి [illegible] రెండు కేసులో [illegible]రంగా వుండకుండా అభ్యుదయ దృష్టితో సహృదయతో వాళ్ళని చూడ అవేదివరంగా చూడాలని చెప్తూ ఉదాహరణకు అని చెప్పి చిన్ననాటి తన సంగతిని చెప్తూ 'ఆ లెక్చరరుగారు వారే' నంటూ చెయ్యెత్తి రాజారాంను చూపించి రాధికారాణి. రాజారాం చిన్నగా నవ్వుకున్నాడు 'కట్టు బొట్టులో మార్పొచ్చినా రాధిక మాటల్లో మాత్రం మార్పు రాలేదనుకున్నాడు.'

స్పీచ్ ముగిసిన తరువాత రాధిక మాటల్నే మరీమరీ తలచుకుంటూ ఇంటి మొహం పట్టాడు రాజారాం. ప్రక్కన తండ్రి ఉన్నాడన్న సంగతికూడా మర్చిపోయి తనను గుర్తుకు తెచ్చుకున్నదే కాక అంత పెద్దసభలో తనను గురించి చెప్పింది కూడా. ఏమైన రాధిక చాల ధైర్యవంతురాలు అనుకున్నాడు. [illegible] తను 'అ[illegible]' అని చెప్పినపుడు రాధిక చూసిన చూపులే మరీమరీ జ్ఞాపకం వస్తున్నాయి. వాటి అర్థమేమిటో కూడా తెలుసుకోలేక పోయాడు రాజారాం.

ఇంతలో తలుపు చప్పుడయ్యేసరికి వెళ్ళి తెరిచాడు. బయట చీకటిగా వుండటం వల్ల ఎవరూ కనిపించలేదు. లైటు వేశాడు. ఎదురుగా తెల్లటి చీరెలో రాధిక.

'ఓహ్.. రారా రాధికా' అప్రయత్నంగానే చనువుగా ఆహ్వానించాడు రాజారాం.

తేలిగ్గా శ్వాస తీసుకుంది రాధిక.

'అమ్మయ్య మీరు [illegible]ంటానే వుంటారన్న నా ఊహ తప్పి పోలేదు' అని 'కనీసం మీకైనా [illegible]ను రాధికారాణిని కానందుకు సంతోషంగా వుంది' అంటూ

# ఇష్టారాజ్యం

'సెక్స్ విషయంలో నీ యిష్టమే రాజ్యం' అని ఒకనాడు వాదించిన మేధావులంతా యీనాడు నాలిక్కరుచుకున్నారు. చెందరాళే గ్రహించిన వారు పశ్చాత్తాపపడ్డారు కూడా.

ఆన్ది రోడ్' (రోడ్డు మీద అనేకన్నా రోడ్డు స్వేచ్ఛ అనచ్చు) అనే పుస్తకంలో యీ విషయాన్ని సమర్థిస్తూ, ఒప్పుకుంటూ రాసిన జాక్ కెరూవక్ అనే ఆయన యీరకం 'హాయి' సిద్ధాంతమంత మంచిది కాదని తన చివరి దశలో అభిప్రాయపడ్డారు.

'సెక్స్ కేవలం ఆనందం కోసమేనని, అది యిష్టారాజ్యమని ఒకనాడు వాదించిన డాక్టర్ స్పాక్ సెక్స్ కేవలం తాను ప్రేమించిన ఒకే ఒకవ్యక్తి కోసం దాచుకోవాలని, ఒకరి నొకరు ప్రేమించుకుని ఒకరికొకరు అంకితమైన స్త్రీ పురుషులు యీ సెక్సు ఒకరి కోసం ఒకరు వుంచుకోవాలనీ, యీనాడు ఒప్పుకున్నారు.

నిజానికి ఈ 'స్వేచ్ఛ', 'హాయి', 'ఒప్పుకు' నే సిద్ధాంతం దేశానికి, వంటికి కూడా అట్టే మంచిదికాదు. దీనివల్ల సెక్సుకు సంబంధించిన సిఫిలిస్, గనేరియా వంటి వ్యాధులు చాలా అధికసంఖ్యలో వస్తున్నాయి. ఒకే ఒక స్త్రీతో క్రమమైనా, అక్రమమైనా ఏదో ఒక సంబంధం పెట్టుకున్న వానికి ఫరవాలేదు కాని, కనిపించిన, పిలిచిన, ఒప్పుకున్న ప్రతి స్త్రీతోనూ సెక్సు ఒక ఆటగా, ప్రయోగంగా తీసుకుని, స్వేచ్ఛగా విహరించే వారికి యీ సుఖరోగాల నుంచి విముక్తి లేదు. 1950—60 మధ్య యీ రోగాలు కాస్త తగ్గుముఖం పట్టినా, యిటీవల ప్రపంచమంతటా యివి విజృంభిస్తున్నాయి. ఒక్క బ్రిటనులో 1956 లో 47 వేలుండిన యీ కేసు లీనాడు 50 వేలు దాటాయి.

రానురానూ నీతి, నియమం తగ్గిన కొద్దీ సెక్సులో విచ్చలవిడి ఎక్కువవుతోంది. ఇది ఎక్కువైన కొద్దీ యీ వ్యాధుల సంఖ్య పెరుక్కుంటూ పోతోంది. సామాన్యంగా కామోద్రేకానికి గురై జబ్బులకు లోనయ్యే వారు ఆడవారిలో 16—19 ఏళ్ళవారు, మగవారిలో 22 పైబడ్డవారూ వుంటున్నారు.

ఆనాడు యీ జబ్బులు కేవలం వేశ్యల ద్వారా, వేశ్యలకూ వచ్చేవి. ఈనాడు వయస్సులో వున్న (లేని కూడా) స్త్రీలే పురుషులను పురేకపరచి, తృప్తి పరుస్తున్నందు వల్ల, మగవారికి కాస్తబ్బు ఖర్చు కూడా లేకుండా పోతోంది.

గర్భ నిరోధక సాధనాలు వంటివి దేశానికో శాపంలా, అట్టి వారికో వరంలా వచ్చాయి. ఈనాడు దొరుకుతున్న పిల్స్ వంటి వాటివల్ల గర్భం వస్తుందేమోనన్న భయం కూడా లేకుండా పోయింది. ఈ పిల్స్ రావడానికి ముందు గర్భ నిరోధానికి ఉపయోగించే (ప్రొటెక్షనల్ షీత్) ఒక రకం పొర వంటి దానివల్ల యీ రోగాలు వచ్చేవి కావు. ఇప్పుడు యీ పిల్స్ ధర్మమా అని ఆ రోగాలు కూడా విరివై పోతున్నాయి.

ఈ విషయాలను లండన్‌లో కల్ల పేరెన్నిక గల వెనీరియాలజిస్ట్ డాక్టరు క్లాడే స్కాట్ నికాల్ ఢిల్లీ వచ్చినప్పుడు స్పష్టంగా చెప్పారు.

పూర్వకాలపు పిల్లల్లా కాకుండా యీకాలం పిల్లలు అన్నిట్లా స్వేచ్ఛా జీవులని, మత, కుల, గౌరవ సంబంధమైన ఏకట్టుబాట్లనూ వారు లెక్క చేయటం లేదని, నైతిక సంబంధమైన చింతన, ఆలోచన వారిలో శూన్యమని, వారు మానసికంగా ఎదిగేలోగానే తమ తమ తలిదండ్రులతో వేరుపడి, స్వేచ్ఛా జీవనం ప్రారంభించి యవ్వనోద్రేకంలో కామోద్రేకంలో పడి యిష్టం వచ్చినట్టు తిరుగుతున్నారని ఆయన అభిప్రాయపడ్డారు.

వయస్సులో వున్న పిల్లల కీనాడు తిరుగుళ్ళు ఎక్కువ. ఎప్పుడు చూసినా ఉల్లాస ప్రయాణాలూ, షికార్లూ, పిక్నిక్కులు. ఇలాటి సందర్భాల్లోనే లైంగిక పుద్రేకం అదుపులో పెట్టుకోలేక తప్పుదారి పడుతుంటారు అనికూడా డాక్టర్ క్లాడే అన్నారు.

డాక్టర్ క్లాడేనికాల్ ఢిల్లీ ఇర్విన్ ఆసుపత్రి చూసి, తత్ సంబంధమైన పరికరాలు సదుపాయాలూ చూసి పెదివ విరచి, కలరా, మశూచికం వంటి రోగాలకు వుంత నివారణా సౌకర్యాలు యీ వెనీరియల్ డిసిజెస్ (సెక్సు రోగాలు—సుఖ రోగాలు) కు హిందూదేశంలో లేవని అభిప్రాయపడ్డారు.

తత్ సత్యం.

—భూపతి

# 50 పైసలు లాభం పొందండి!

ఆకర్షణీయమైన
50 పైసల
విలువగల వంటింటిలో
అనేక విధాల ఉపయోగపడు
డబ్బా మీకు 10 పైసలకు
మాత్రమే లభిస్తుంది






నేడే బోర్న్‌విటా టిన్ కొనండి దానిలో వంటింటిలో ఉపయోగపడు అందమైన డబ్బా పొందండి. అది పాలియస్టిరీన్‌చే తయారు చేయబడింది. ఇందులో మీరు పంచదార, ఉప్పు, మసాలా మరి తదితర ఆహార పదార్థాలను ఎంతో వీలుగా పోసికొనవచ్చును.

**ఈ సదుపాయం సరకు ఉన్నంత వరకు మాత్రమే లభిస్తుంది.**

ప్రతి డబ్బాలో ఇదివరకు ఉన్నంత బోర్న్‌విటా (450 గ్రా. నికరం) ఉంటుంది.

ఎకానమీ టిన్ కొనువారికి గూడ ఈ ప్రత్యేక సదుపాయం గలదు.

**శక్తి, ఉత్సాహం మరియు రుచి కోసం కేడ్‌బరీస్ బోర్న్‌విటా!**

BENSONS-6998 TEL

పెదకద



# నువ్వంటే నాకిష్టం

[గతసంచిక తరువాయి]

విజయ్‌కి గట్టిగా ఘాటుగా సమాధానం చెప్పాలి. ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలీదుగాని, నోటికి వచ్చినట్టు మొదలు పెట్టాను.

విజయ్! నేనొకమాట చెబుతాను వింటావా ?'

'ఓ! యస్! వినడానికే అయితే అభ్యంతరంలేదు.' చాలా ఈజీగా అనేసాడు.

'నువ్వు ప్రేమా గీమా అంటూ పిచ్చి మాటలు మాట్లాడకు. మీ అమ్మగారికి, నాన్నగారికిగాని తెలిసిందంటే అనవసరంగా గొడవ పడతావు. ఎందుకు నీకు ఇలాంటి పనులు చెయ్యడం!'

'అయ్యిందా ఉపన్యాసం ?' అన్నాడు విజయ్

నేను నవ్వులాటకి చెప్పటంలేదు. నిజంగా మీ అమ్మగారి దగ్గరికి వెళ్ళి పెళ్ళి చెయ్యమని అడుగు. చక్కని పిల్లని చూసి పెళ్ళి చేసేస్తారు. అంతేకాని ఇలా చెయ్యటం ఏం బాగుండలేదు.' శాంతంగానే చెప్పాను.

'ఎలా చెయ్యటం ?' అని నవ్వుతూ వెంటనే అన్నాడు.

'నువ్వు ఇలా చెయ్యటం ఏం బాగులేదు. ఎందుకింత మొండి పట్టుదల నీకు?

కాసేపు ఇద్దరం మౌనంగా ఉన్నాం. ఉన్నట్టుండి విజయ్ అన్నాడు 'అసలు పెళ్ళి నిశ్చయం అయిపోయింది తెలుసా? పెళ్ళి నిశ్చయం అయింది.'

నేను ఉలిక్కిపడ్డాను. శారద నాకీ విషయం ఎన్నడూ చెప్పనేలేదు. అయితే విజయ్ పెళ్ళి నిశ్చయం అయ్యాకే నాతో ఇలా ఆడుకుంటున్నాడన్నమాట!

నా ముఖంలో భావాలన్నీ చదివినట్టున్నాడు. అతను నవ్వుగా నవ్వాడు. 'ఏం! అంత ఉలికిపడ్డావ్! నన్ను పెళ్ళిచేసుకోవడం ఇష్టం లేకపోతే ఆ ఉలికిపాటు దేనికి ?'

నేను తమాయించుకుని అడిగాను: 'ఆ అమ్మాయి ఎవరు? నాకు చెప్పలేదేం?'

'నేను ఎవర్ని చేసుకుంటే నీకెందుకు? నీకు చెప్పాలని ఎక్కడుంది?'

అవును. నిజమే! కాని...కాని... నాకేదో బాధగా ఉంది. విజయ్ నన్ను మోసం చేసాడనిపిస్తోంది. నేను క్రిందికి చూస్తూ కూర్చున్నాను.

విజయ్ నాచేతిని తన చేతిలోకి తీసుకుంటూ నవ్వాడు 'పిచ్చి పద్మా! నా పెళ్ళి నిశ్చయం అయ్యింది అనగానే దిక్కుముఖం పెట్టేసావేం ?'

మృదువుగా అడిగాడు 'నేనంటే ఇష్ట మేకదూ ?'

నా మనసులోని భావాలు అతను పుస్తకంలా చదివేస్తూంటే, నా అసహాయతకి నాకే కోపం వచ్చింది.

విజయ్ మళ్ళీ అన్నాడు 'నిశ్చయం లేదు, ఏమీ లేదు. నువ్వు ఒప్పుకుంటే, మన పెళ్ళి రేపే నిశ్చయం అవుతుంది. పెళ్ళీ అవుతుంది.'

నన్ను ఆడించడానికన్నట్లు అతను అబద్ధం ఆడాడు. నేను కోపం తెచ్చుకుందామనుకున్నాను. కానీ నా మనసు తేలిక అయి సంతోషంగా వుంది. అయినా కోపం నటిస్తూ అన్నాను 'చాలు, చాలు. ఇంకేమీ చెప్పకు' విసురుగా చెయ్యి వదిలించుకున్నాను.

'మన పెళ్ళి దాదాపు నిశ్చయం అయినట్టే! నువ్వు ఒప్పుకోవటం ఒక్కటే ఆలస్యం. అదీ అయిపోతుంది కొద్ది రోజుల్లో!' చాలా నమ్మకంగా చెప్పాడు.

'హోహో! నేను ఒప్పుకుంటానని నీకు తెలుసునన్నమాట!' ఎగతాళిగా అన్నాను.

'ఆ! ఒప్పుకుంటావు. తప్పకుండా ఒప్పుకుంటావు. కాకపోతే, బాగా బ్రతిమాలించుకోకుండా ఒప్పుకోవడం ఏమిటని బెట్టు చేస్తున్నావు. అంతే!'

నేను కోపంతో మాట్లాడలేదు. ఇంతలో రఘు, శారద రావటం చూసాను. ముఖం మీదికి నవ్వు తెచ్చేసుకుని పలకరింపుగా అన్నాను 'అయ్యయ్యా మీ జల్కిడలు!'

శారద బాగా అలిసిపోయింది. విజయ్ వంక చూస్తూ అంది 'పద్మ ఒక్కతే ఉండి. ఆ సంగతి నాకు తెలియగానే, మరి నువ్వు కూడా ఉండకుండా వచ్చేసావేం? నువ్వూ తనని చూసి నేర్చుకుంటున్నావా?'

విజయ్ తేల్చేస్తూ అన్నాడు 'మీ ఇద్దరి మధ్యా నేనెందుకు? నేను అక్కడ ఉన్న ఆకాస్సేపటికే అక్ష పార్వ...నా తీసుకుని ఉంటాను.' శారద నవ్వేసి ఊరుకుంది.

గెస్ట్ హౌస్‌కి వచ్చాం. తినుబండారాలన్నీ తినేసాక, శారద నాన్నగారు, రఘు చెస్ ఆడటం మొదలుపెట్టారు. శారద అక్కడే కూర్చుని సలహాలు ఇస్తోంది. కమలమ్మగారు అందరికీ కాఫీలు అందిస్తున్నారు. నేను చూస్తూ నిలబడ్డాను.

నాకు నిద్ర వచ్చినట్లుగా ఉంది. లోపలికి వెళ్ళాను. ఆ గదిలో విజయ్ పడుకుని నవల చదువుతున్నాడు. నేను అటూ, ఇటూ చూస్తున్నాను ఎక్కడ పడుకోనా, అని. విజయ్ అది గమనించి మెల్లిగా అన్నాడు 'ఇక్కడే పడుకోరాదూ, బోలెడు స్థలం వుంది!' తన ప్రక్కనే చోటు చూపిస్తూ.

నేను తెల్లబోయాను. అతనికి దగ్గరగా వెళ్ళి చురచుర చూస్తూ గొంతు తగ్గించి 'నీకేం బుద్ధి లేదూ? వాళ్ళు వింటే...?'

'వినలేదుగా, అయినా వినకపోతే ఫరవా లేదన్నమాట!' విజయ్ కూడా గొంతు తగ్గించి అన్నాడు.

'ఇక అతనికేం సమాధానం చెబుతాను! విసవిసా ఇవతలకి వచ్చేసాను.

ఆ మర్నాడే విజయ్, రఘు వెళ్ళిపోయారు. అందరికి చెప్పినట్టే నాకూ గుడ్‌బై చెప్పి వెళ్ళాడు విజయ్.

అతను వెళ్ళిపోయాక అంతా వెలితిగా ఉన్నట్టు అనిపించింది. శారద సరే సరి! రఘు వెళ్ళాక బెడ్‌రూంలోకి వెళ్ళి గడియ బిగించుకుంది. నేను భారంగా ఇంటికి వచ్చేసాను.

ఆ రాత్రి సరిగా నిద్రపట్టలేదు. మళ్ళీ విజయ్ ఎన్నాళ్ళకి వస్తాడో! బహుశా నాలుగునెలల వరకు రాడేమో! నాలుగు నెలలంటే నాలుగు యుగాల్లా అనిపించాయి. మనసంతా దిగులు ఆవరించుకుంది.

...రంరోజులు చాలా నెమ్మదిగా జరిగాయి. ఈ వారం రోజుల్లోనూ ఎన్నో సార్లు నాకు మద్రాసు వెళిపోదాం అనిపించింది. వెళ్ళనని నాకూ తెలుసు ఆ ఆలోచనే తెలివితక్కువగా ఉందనీ, పనికిరానిదనీ తెలుసు. అయినా 'మద్రాసు వెళితే' అంటూ ఊహించుకోవడం మొదలుపెట్టాను కాలక్షేపానికి.

ఒకరోజు మధ్యాహ్నం వరండాలో కూర్చుని నవల చదువుతున్నాను. పోస్ట్‌మాన్ వచ్చి ఉత్తరాలు విసిరేసి హడావిడిగా వెళ్ళిపోయాడు. అన్నీ చెల్లాచెదురుగా పడ్డాయి. వాడిని తిట్టుకుంటూ ఆ ఉత్తరాలన్నీ ఒకదానిమీద ఒకటి పేరుస్తున్నాను. అన్నీ నాన్నగారికే ఒకదానిమీద మాత్రం నా పేరు ఉంది. నాకు ఉత్తరాలు రాసేవాళ్ళెవరూ లేరు. ఆత్రంగా ఉత్తరం చించాను. అది విజయ్ దగ్గరనుంచి! ఇలా ఉత్తరం వస్తుందని నేను కలలోకూడా అనుకోలేదు. ఒక్కసారిగా ఆశ్చర్యం, ఆనందం ముప్పిరిగొన్నాయి. గబగబా ఉత్తరం చదవటం మొదలుపెట్టాను. విశేషాలేమీ లేవు. సంబోధనలోనూ ప్రత్యేకతలేదు. 'ప్రియమైన పద్మా' అంటూ రాసాడు. నన్ను వెంటనే రాయమన్నాడు ఉత్తరం. అడ్రసు క్రింద రాసాడు. ముగింపులో అతను చేసిన 'నీ విజయ్' అన్న సంతకం నాకు గిలిగింతలు పెట్టినట్టు అయ్యింది.

ఆ ఉత్తరం జాగ్రత్తగా నా చీరల అడుగున దాచాను. సాయంత్రం లోపున కనీసం యిరవై సార్లయినా చదివాను. ఆ రాత్రి పడుకున్న తరువాత కూడా ఉత్తరం గురించే ఆలోచిస్తున్నాను. హఠాత్తుగా విజయ్ వెళ్ళక పూర్వం నేను చేసుకున్న నిర్ణయాలు. వాటికి కారణాలు జ్ఞాపకం వచ్చాయి. ఒక్కసారిగా నేను తప్పుచేసి తిరిగి తెలుసుకున్నట్టు అయింది. అంత గట్టి నిర్ణయాలు చేసుకుని మళ్ళీ నేనెందుకు ఇలా మారిపోయాను! విజయ్‌కి ఉత్తరం రాయకూడదు మళ్ళీ క్రొత్త నిర్ణయం ఇది. ఇలా నా బ్రతుకంతా నిర్ణయాలు చేసుకోవడంలోనే గడిచేట్టు ఉంది.

మరొక పది రోజులు భారంగా గడిచాయి. విజయ్ మళ్ళీ ఇంకొక ఉత్తరం రాసాడు. చాలా కోపంగా రాసాడు. 'ఫూలిష్ పద్మా' అంటూ మొదలుపెట్టి నేను ఉత్తరం రాయనందుకు గట్టిగా తిడుతూ రాసాడు. దీనికీ నేను జవాబు రాయలేదు.

రెండు రోజుల అనంతరం ఇంకొక ఉత్తరం వచ్చింది చాలా హడావిడిగా రాసినట్లున్నాడు. పైన అడ్రసు రాయడమే బరికేసినట్టు రాసాడు. నేను తీరిగ్గా సాయంత్రం వరకూ ఉంచి అప్పుడు చదివాను.

'మై వెరి డియర్ పద్మా!' అని మొదలు చదివేసరికే నా గుండె కొట్టుకోవటం హెచ్చింది.

'నేను అమ్మకి మన విషయం చెప్పేసాను. కానీ నువ్వు ఫలానా అని గాని, నీ పేరుగాని చెప్పలేదు. మిగతా వివరాలు మాత్రం చెప్పాను. అమ్మ నాన్నగారితో చెప్పినట్టు ఉంది. ఇవాళే, ఇంకా ఒక అరగంట క్రితం ఇద్దరూ నన్ను పిలిచి, నేను ఏ పిల్లని చేసుకున్నా తమకి ఆనందమేనని, నాకై నేను పెళ్ళిచేసుకుంటానని అనటం చాలా సంతోషం కలిగించిందనీ చెప్పారు. నేను నా భార్యని ఎన్నుకోవడంలో తప్పటడుగు వెయ్యనని వాళ్ళకి గట్టిగా నమ్మకం ఉందట!

పద్మా. ఇప్పుడైనా నీకు నమ్మకం కుదిరింది కదూ నామీద! నీ

# నువ్వంటే నాకిష్టం

లేకుండా నాకు నీపేరుగానీ, నీ వివరాలు గానీ అమ్మకి చెప్పటం ఇష్టం లేకపోయింది. తిరుగుటపాలో నీ అంగీకారం తెలియజేస్తావని ఎదురు చూస్తూంటాను.

మా అమ్మ, నాన్నగారు సంతోషంగా ఒప్పుకుంటారు మన పెళ్ళికి. 'ఒప్పుకుంటారు లేమిటి, ఒప్పుకున్నారు. మీ నాన్నగారికీ, అమ్మగారికీ అభ్యంతరం ఉంటుందని నేను అనుకోను. నీ అంగీకారం తెలియజేసిన మరుక్షణం, మిగతా కార్యక్రమం చకచకా జరిగిపోతుంది. మరి నీ ఉత్తరం కోసం ఎదురు చూస్తూంటాను—నీ, విజయ్.

నువ్వు ఉత్తరం రాయకపోతే, నాకు చదువుమీదికి దృష్టి పోవడంలేదు. నేను తప్పితే, పద్మ మొగుడు తప్పాడు అంటారు. మరి నీయిష్టం—నీ విజయ్.

అంటూ ముగించాడు. నా మనసు పురి విప్పిన నెమలిలా నాట్యం చేసింది. నా నిర్ణయాలు రూపు మసి పోవడానికి ఒక్క క్షణం కూడా పట్టలేదు. ఆ ఉత్తరం పదేపదే చదువుకున్నాను.

వెంటనే విజయ్‌కి ఉత్తరం రాయాలి. కాని, ఏలా రాయాలి? సిగ్గు ముంచుకు వచ్చింది. పెళ్ళికి నాకు పూర్తి అంగీకారమేనని, ఏలాంటి అభ్యంతరం లేదని...... ఇంకా ఏదో రాయాలి, ఆ ఉద్దేశ్యం కాగితంమీద ఎలా పెట్టాలి? ఉత్తరంద్వారా విజయ్‌కి ఎలా తెలియజేయాలి? ఎన్ని కాగితాలు సగం, సగం రాసి చింపేసానో చెప్పలేను. అయినా ఆ మరునాటి సాయంత్రానికికూడా ఉత్తరం రాయటం కుదరలేదు. నా మనసులో అతని పట్లగల అనురాగం పూర్తిగా అతనికి అర్థం అయ్యేలా రాయాలన్నదే నా కోరిక. అందు చేత కాస్త ఆలస్యం అయినా, నా ప్రయత్నం పూర్తిగా సఫలం కావాలనే ఇంకా ఇంకా ఏదో ఆలోచిస్తూ, రాస్తూ, చింపేస్తూ, అందమైన కలలు కంటూ, ఊహించుకుంటూ నాకు తెలియకుండానే మూడు రోజులు గడిపేసాను.

ఇంతలో కబురు లేకుండా రామచంద్రపురంనుంచి మాకి పెద్దమ్మ వచ్చింది. పెద్దమ్మకి పిల్లలు లేరు. నేను తన పెంపుడు కూతుర్నని అందరితో చెబుతూ ఉంటుంది. పెద్దమ్మ ఉన్న నాలుగు రోజులూ నేను రాసే ప్రయత్నమే చెయ్యలేదు. ఇలాంటి రహస్యమైన పనులు పసిగట్టేస్తుంది పెద్దమ్మ.

పెద్దమ్మ రామచంద్రపురం తిరుగు ప్రయాణం కడుతూ నన్నూ తీసుకు వెళతానంది. అందర్నీ ఒప్పించింది తన్నని సరిగా, ఇష్టం లేకపోయినా బయలుదేరాను నేనుకూడా. వెళ్ళేన్నంతసేపు — అక్కడికి వెళ్ళాక విజయ్‌కి ఏలా సీడ చేసుకుని ఉత్తరం రాయాలో ప్లాన్సు వేస్తూనే ఉన్నాను. ఇంక ఆలస్యం చెయ్యకూడదని నిశ్చయించుకున్నాను. వీలయితే వెళగానే రాసెయ్యాలి

హైదరాబాదునుండి రామచంద్రపురం పద్దెనిమిదిమైళ్ళు. ఆ పద్దెనిమిది మైళ్ళూ మాటవినని మైళ్ళలా తోచింది నాకు.

ఆమర్నాడు పెద్దమ్మ వంటచేస్తూంటే, తలనొప్పి వంకతో పడుకుంటానని చెప్పి గదిలోకి దూకి ఉత్తరం రాసేసాను. ఎన్నో ఊహించుకున్నాను ఉత్తరంలో రాయడానికి. వాటిగురించి ఆలోచిస్తే, ఈ అవకాశం పోవచ్చు. అందుకే ఏదో ఇష్టం ఉన్నట్టు రాసేసి, ఉత్తరం కవర్లో పెట్టి అంటించేసాక గుర్తు వచ్చింది, విజయ్ ఇప్పుడు హైదరాబాదులోనే ఉండిపోయాడని, ఏడుపు వచ్చినంత పనయ్యింది. ఇప్పుడెలా! మళ్ళీ హైదరాబాదు వెళ్ళే వరకూ ఇంతే! ఈ ఆలస్యానికి అతను ఏమని అర్థం చేసుకుంటాడు? నన్ను అపార్థం చేసుకోడు కదా!

ముళ్ళమీద ఉన్నట్టు అనిపించింది రామచంద్రపురం. నా మతిమరుపుకు ప్రతి క్షణం తిట్టుకుంటూనే ఉన్నాను. దీని కంతకూ కారణం అయిన పెద్దమ్మను కూడా తిట్టుకున్నాను. ఏమి లాభం హైదరాబాదు త్వరగా వెళ్ళిపోవాలి.

వారం రోజుల్లో నన్ను పంపేస్తానన్న పెద్దమ్మ పదిరోజులకిగాని వదలలేదు. నేను చాలా ఆత్రంగా హైదరాబాదు వచ్చాను. అప్పటికి విజయ్ వద్దనుండి ఉత్తరం వచ్చి దాదాపు ఇరవై రోజులు అవుతోంది. ఆ పని ఆలస్యం ఎంతో అయ్యింది, రాసేదేదో తిరిగి రాద్దామని, ఆ మర్నాడు భోజనం చేసాక వరండాలో కూర్చుని మొదలుపెట్టాను ఉత్తరం. చాలా వివరంగా నా ఆలస్యానికి కారణం రాసాను మొదట. ఆ తరువాత పెళ్ళి విషయం వచ్చే సరికి మళ్ళీ మొదటికే వచ్చింది వ్యవహారం! ఏం రాయాలో సందేహం! అరగంట ఆలోచించి 'పెళ్ళి విషయం నీ ఇష్టప్రకారం చెయ్యి' అని రాసి ఊరుకున్నాను. సంబోధన ఏమీలేదు. ఉత్తరం ముగిస్తూ ఉండగా గేటుతెరిచిన చప్పుడు అయ్యింది. తలఎత్తి చూస్తే, శారద వస్తోంది! ఈ ఉత్తరం చూసిందంటే, ఎవరికి, ఏమిటి అని అడగక మానదు అడిగితే అంతా చెప్పేయాల్సి వస్తుంది. అమ్మయ్యో! చెప్పెయ్యటమే! చెప్పకూడదని కాదు గానీ, ఎలా చెప్పటం...' గబ గబా లోపలికి పరిగెత్తి, ఆ కాగితాలు బల్ల సొరుగులో పడేసి శారదకి నవ్వుతూ స్వాగతం చెప్పాను.

అక్కడికి శారద అడగనే అడిగింది—'ఏమిటే, అంత బిజీగా రాస్తున్నావ్?' అంటూ. నేను కంగారుగా మాట మార్చేసాను వినిపించుకోనట్టుగా. ఇద్దరం కూర్చుని చాలా సేపు మాట్లాడుకున్నాం.

ఉన్నట్టుండి శారద అంది 'అన్నట్టు నీకు నో ముఖ్య విషయం చెప్పాలి. విజయ్ ప్రేమలో పడ్డాడు' అని ఆగి మళ్ళీ 'ఆ ప్రేమ ఇలాంటి, అలాంటి ప్రేమ కాదు. చాలా ఘాటు ప్రేమ' అని నవ్వింది.

'అయితే శారదకి మా విషయం తెలిసిందన్న మాట. మామూలుగా ఉండడానికి ఎంత ప్రయత్నించినా సాధ్యం కావడంలేదు. సిగ్గు ముంచుకొచ్చింది.

'అంతకీ ఆ అమ్మాయి ఎవరని అడగవేం?' అంది శారద.

నన్ను ఆట పట్టిస్తోందా? లేక పరీక్షిస్తోందా? మళ్ళీ తనే అంది 'సరే! నేనే చెబుతాను. ఆ పిల్ల పేరు లత అట. వాళ్ళ ఫేమిలీ విజయ్‌కి కొత్తగా ఫ్రెండ్సు అయ్యారట. ఆ అమ్మాయి, అంటే లత బి. ఏ. చదువుతోందట మా గ్రామంలోనే'

నాకు కళ్ళు చీకట్లు క్రమ్మినట్టయింది. ఏమిటి శారద చెప్పేది! నిజమేనా?

'నిజమా, శారదా?' అని అనుమానంగా అడిగాను.

'నరే' అబద్ధం చెప్పాల్సిన అవసరం ఏముంది!' అని 'అబ్బా' ఏక ఆ ఇంత

గురించి ఒకటే రాసేస్తున్నారతే ఉత్త అంది. [illegible] దగాస్తున్నారు యధాంతికంగా తనే చెప్పింది [illegible]

[illegible] శారద చెబుతోంది. [illegible] కలా, బారెడేసి [illegible]

# విటమిన్లు మరియు ఖనిజములు మీ కుటుంబముయొక్క ఆరోగ్యమునకు ఎంతో అవసరము

# వారికి తగినన్ని లభిస్తున్నాయటా?




విటమిన్లు మరియు ఖనిజముల లోపముతో మీ కుటుంబపు ఆరోగ్యము పాడవవచ్చును. అలసట, జలుబు, ఆకలిలేకపోవడము, నిరుత్సాహము, చర్మము మరియు పళ్ల బాధలు మొదలైనవన్నీ అవసరమైన విటమిన్లు మరియు ఖనిజముల లోపమువల్ల మామూలుగా కలుగుతాయి అయినా విటమిను మరియు ఖనిజములను గురించి అశ్రద్ధ చేయబడుతుంది ఎంతో జాగ్రత్తగా ఆలోచించి తయారుచేసిన ఆహారములో కూడ. సమృద్ధియైన ఆహారము సరియైన ఆహారము అనుటకు వీలులేదు. ఎన్నో రకముల ఆహారములలో కూడ విటమిన్లు మరియు ఖనిజములు లోపించవచ్చును. కనుక, మీ కుటుంబమునకు ఎంతో అవసరమైన విటమిన్లు మరియు ఖనిజములు తగు పరిమాణములలో లభిస్తున్నాయని ఎలా నిశ్చయము చేసుకోగలరు?

మీ కుటుంబములో ప్రతి ఒక్కరికి నిశ్చయముగా ఈ అవసరమైన పోషక పదార్థములు వారికి కావలసిన పరిమాణములలో లభించుటకు, వారికి విమ్‌గ్రాన్— స్క్విబ్ వారి వివిధ విటమిన్లు మరియు ఖనిజములుగల బిళ్ల లియ్యండి. రోజా ఒక బిళ్ల చాలును. ఈ ఆరోగ్య సూత్రమును నేడే ఎందుకు అలవాటుచేసుకోకూడదు?

విమ్‌గ్రాన్‌లో పదకొండు ముఖ్యమైన విటమిన్లు మరియు ఎనిమిది ఖనిజములు ఉన్నాయి. పుష్కలమైన పరిమాణములో. ఇనుము ఎఱ్ఱ రక్త కణములను పెంపొందిస్తుంది మరియు శక్తిని తిరిగి కలిగించుటలో సహకరించును. కేల్షియమ్ ఎముకలను మరియు పళ్లను బలిష్టముగా ఉంచుతుంది. విటమిను సి జలుబు రాకుండా అడ్డుతుంది. విటమిను ఎ దృష్టిని బాగుగా మరియు చర్మమును ఆరోగ్యవంతముగా ఉంచుతుంది. విటమిను బి-12 ఆకలిని అధికము చేస్తుంది మరియు సహనశక్తిని కలిగిస్తుంది — ఇంకా, మీ కుటుంబముయొక్క ఆరోగ్యమునకు ఎంతో అవసరమైన యితర ముఖ్యమైన పోషక పదార్థములు ఉన్నాయి.

# విమ్‌గ్రాన్®

వివిధ విటమిన్లు మరియు ఖనిజములుగల బిళ్లలు

**11 విటమిన్లు మరియు 8 ఖనిజములు కలది.**

**ఒకే ఒక విమ్‌గ్రాన్ మిమ్మల్ని రోజంతా శక్తివంతముగా ఉంచుతుంది.**

Squibb® SARABHAI CHEMICALS

ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్, ఇన్కార్పొరేటెడ్ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు [illegible]

Shilpi-HPMA-25A/71 Tel.

చెక్కిన విగ్రహంలా ఉంటావందట. నవ్వితే నవ రత్నాలు రాలతాయట. మాట్లాడితే ముత్యాలు రాలతాయట. నడిస్తే హంసలు సిగ్గు పడతాయట. ఇవన్నీ నా మాట అనుకొనేవ్! విజయ్ రాశాడు...' పక పకా నవ్వుతోంది శారద. నేను బలవంతాన నవ్వబోయాను. సాధ్యపడలేదు.

# నువ్వంటే నాకిష్టం

'విజయ్, అతను ఒకటే తిరుగుతున్నారట పార్కులకి. సినిమాలకీ. ఎక్కడ చూసినా వాళ్ళిద్దరేనట. వాళ్ళిద్దరూ కలిసి వెళ్ళని పిక్నిక్ స్పాట్ లేదట ఆ దరిదాపుల్లో! విజయ్ రాసే ఉత్తరాలన్నీ అతని గురించే! అబ్బబ్బ! నాకు బోర్ కొట్టేస్తున్నాయి. ఇక్కడ వాళ్ళ ఫ్రెండ్స్ అంతా అనుకుంటున్నారట వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటారని! అదీ తనే రాశాడు!' ఇంకా ఏమేమో చెబుతూనే ఉంది శారద. నా కేమీ వినబడటం లేదు ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్టు అనిపించింది. కన్నీళ్ళు పొంగి వచ్చేస్తున్నాయి. ఎలా నిగ్రహించుకున్నానో నాకే తెలియదు.

మధ్యమధ్యలో 'ఏమిటి, అలా ఉన్నావ్' అని అడుగుతూనే విజయ్, అతని గురించి చెప్పి వెళ్ళిపోయింది శారద.

నేను పక్కమీద వాలిపోయాను. అప్పటి వరకూ ప్రయత్నంమీద ఆపుకున్న బాధ కన్నీళ్ళ రూపంలో పొంగి వచ్చింది.

ఎంత మోసం చేశాడు విజయ్! నన్ను ప్రేమిస్తున్నట్టు నటించి దగా చేశాడు! ఎలాంటి చైతన్యమూ లేకుండా నిశ్చలంగా ఉన్న నా మనస్సును కదిపి, తన దారిన తాను వెళ్ళిపోయాడు. మోసగాడు! దుర్మార్గుడు! ఎంత బాగా నటించాడు, నన్ను ప్రేమిస్తున్నట్టు! ఎంత కవ్వించాడు! నేను అదంతా నిజమేనని నమ్మేశాను. అది నటనా! కాదు అప్పటికి, ఆ కాస్సేపటికి నిజమే అయి ఉంటుంది. మళ్ళీ, అక్కడికి వెళ్ళి, అందమైన ఆడది కనబడగనే అది తుడిచిపెట్టుకుపోయి ఉంటుంది. ఆమె మీద ఆకర్షణ వచ్చి ఉంటుంది. ఛీ! ఏం మనిషి!

ఇలాంటివాడినా నేను ప్రేమించింది? నాకు సరి అయిన పాఠం నేర్పాడు. కసిగా నేను రాసిన ఉత్తరం చించేశాను.

విజయ్‌ని ఎన్నో తిట్టుకున్నాను మనస్సులో. ఎన్నో విధాల నన్ను నేను ఓదార్చుకో జూచాను. అతని మీద ఎంత అసహ్యం పెంచుకుందామన్నా కుదరటం లేదు. అతనికి మనసు లేదు. కాని... నేను? అతనికి ప్రేమంటే విలువ తెలియదు. నేను అలా కాదు.

ఈ సంఘటన జరిగాకే నేను విజయ్‌ని ఎంత గాఢంగా, గూఢంగా నాకు తెలియకుండానే ప్రేమించానో అర్థం అయింది. అతన్ని మరచిపోలేకుండా ఉన్నాను. మరచిపోవడం అసాధ్యం.

పెళ్ళి మాట తలుచుకుంటేనే నాకు కోపం వస్తోంది. అసహ్యం వేస్తోంది. జీవితంలో మరెవర్నీ నేను పెళ్ళి చేసుకోను. అయిన అనుభవం చాలు.

జరిగినదానికి విచారించి లాభం లేదు కదా! వారం రోజులకి బాగా కోలుకున్నాను. నిర్లిప్తత అలవాటు చేసుకున్నాను. ఈ వారం రోజులలోనూ నాలో నాకే ఎంతో మార్పు కనిపిస్తోంది. ఎంత వద్దనుకున్నా విజయ్ జ్ఞాపకం వస్తూనే ఉన్నాడు.

బయటికి వెళ్ళటం పూర్తిగా మానేశాను. శారదా వాళ్ళ ఇంటికి కూడా వెళ్ళటం లేదు. అమ్మ, నాన్నగారు చివరికి తమ్ముడు కూడా అడిగాడు 'ఏమిటి. అలా ఉంటున్నావ్' అని. ఏం చెప్పను!

శారద పదే పదే పిల్చింది వాళ్ళ ఇంటికి రమ్మని. ఒకరోజు వెళ్ళాను, విజయ్ రాసిన ఉత్తరాలు చూపించబోయింది. కాని నేను చూడలేదు అవి చూస్తే నా మనసు నా వశం తప్పవచ్చు. వీలైనంతవరకూ విజయ్ గురించి మాట్లాడటం మానేశాను. శారద మాత్రం ఎప్పుడూ విజయ్ గురించి, అతని ప్రియురాలు గురించి చెబుతూనే ఉంది.

నెలరోజుల తర్వాత ఒకరోజు శారద చెప్పింది విజయ్ వస్తున్నాడని ఎందుకని అడిగాను, అడగవద్దనుకుంటూనే 'ఏదో ముఖ్యమైన 'పని' ఉందట అతనికి ఇక్కడ.'

మళ్ళీ నాలో అలజడి ప్రారంభం అయింది విజయ్‌ని మళ్ళీ నేను చూస్తూ ఎటువంటి భావమూ లేకుండా ఉండగలనా? అతని ఎదుట పడగలనా? ఏదో భయం! కానీ, నా మనసులో ఏ మూలో అతన్ని చూడాలన్న ఆశ! అతను వస్తాడంటే ఆనందం.

ఎప్పుడొస్తాడా అని ఎదురు చూశాను. ఆ రోజు రానే వచ్చింది. వరండాలో నిలుచుని శారదావాళ్ళింటి వైపే చూస్తున్నాను. కారు రావడం చూశాను కారులోంచి శారదా వాళ్ళ నాన్నగారు దిగారు. విజయ్ ఏడీ! ఆత్రంగా చూస్తున్నాను. నల్ల

కళద్దాలు పెట్టుకుని, తెల్లగా, పొడుగ్గా ఉన్న ఒకతను దిగాడు కారులోనుంచి. తేరి పార చూసాను. అవును. అతనే విజయ్. నల్ల కళ్ళ అద్దాలు పెట్టుకుంటే నేను గుర్తించనేలేదు! ఏదో నవ్వుతూ మాట్లాడుతున్నాడు. నేను చటుక్కున లోపలకు వచేసాను.

నా ఇష్టం లేకుండానే అతని రాకను గురించి ఎంత ఆనందపడుతున్న నా మనసంటే నాకు చిరాకేసింది. 'విజయ్ వచ్చాడని నేనేం సంతోషించకూడదు' అని పదేపదే మననం చేసుకున్నాను. కాని అది మననం చేసుకోవడం వరకే అయింది. శరీరం ఇక్కడే ఉన్నా మనసు శారదా వాళ్ళ ఇంట్లో విజయ్ చుట్టూ తిరుగుతూనే ఉంది. కళ్ళు వాళ్ళ ఇంటిమీదే ఉన్నాయి.

ఆ సాయంత్రం విజయ్ ఎక్కడికో కారులో వెళ్ళటం చూసాను. అప్పుడు శారద వచ్చింది మా ఇంటికి.

'విజయ్ వచ్చాడు' అంది కాసేపయ్యాక. 'చూసాను' అని నాలిక కరుచుకున్నాను. ఛ! బయట పడ్డానిపించింది.

వచ్చినప్పటినుండి లత ఖంగ్లే చెబుతున్నాడట విజయ్. లత ఫోటోగ్రఫ్ తీసుకొద్దామనుకున్నాడటగాని, శారదనే మద్రాసు తీసుకురమ్మందట లత. ఇంకా ఏమిటేమిటో చెప్పింది శారద. అన్నీ శ్రద్ధగా విన్నాను. లత తెలివి తేటల గురించి, అంద చందాలగురించి చాలా చెప్పి శారద అంది 'లత తండ్రి మా పెదనాన్నగారిని అడుగుతారట. ఈ నెలాఖరులో లత విజయ్‌కి వస్తానుని. దాదాపు నిశ్చయం అయినట్లే! అయినా లాంఛనాలు ఉంటాయిగా! మా పెద్దమ్మకి, పెదనాన్నకి చాలా ఇష్టం లత అంటే. ఇక విజయ్ సరేసరి. బహుశా పెళ్ళికూడా త్వరలో అయిపోవచ్చు' అంటూ చెబుతోంది.

నేను మరచిపోయాననుకున్న బాధ తిరిగి మొదలు అయ్యింది. నేనిది భరించలేకపోయాను. విజయ్ పెళ్ళి లతతో అవుతుందని తెలిసినా, ఇది వినడానికే కష్టంగా ఉంది.

నేను విసుగ్గా అన్నాను 'ఇక ప్రపంచంలో విజయ్, లత వాళ్ళ పెళ్ళి తప్ప మాట్లాడటానికి ఏం లేవా?'

శారద నా వైపే పరీక్షగా చూస్తూ అంది 'నీకెందుకు అంత చిరాకు లతంటే?'

నేను కంగారుపడ్డాను. 'ఛ! ఛ! నాకు చిరాకేమిటి ?'

'నువ్వు మా ఇంటికి రావేం ? విజయ్ ఇందాక అడిగాడు నిన్ను' అంది శారద.

ఎంత సిగ్గులేనివాడు! చేసింది చాలక నన్ను అడిగాడట పైగా! తను నడిపిన పాత ప్రేమాయణం అంతా మరచిపోయాడు కాబోలు అప్పుడే!

వెళిపోతూ శారద అంది 'రేపు రావాలిగా?'

'వస్తాను' అని చెప్పాను గాని వెళ్ళకూడదని నిశ్చయించుకున్నాను.

ఆ మరునాడు నేను శారదవాళ్ళ ఇంటి వైపు చూడటం మానేసి, అతి ప్రయత్నం మీద, ఏదో నవల చదువుతున్నాను. శారదా వాళ్ళ ఇంట్లోనుండి కారు వెళిన చప్పుడు అయింది. అంతా ఎక్కడికో బయటికి వెళి ఉంటారు. విజయ్ కూడా వెళ్ళాడేమో! ఇంతలో శారదావాళ్ళ పనిపిల్ల వచ్చింది.

'శారదమ్మగారు మిమ్మల్ని అర్జెంటుగా రమ్మంటున్నారు' అని చెప్పింది.

ఎందుకని అడిగితే తనకు తెలియదంది. విజయ్ ఉంటే ఎలా వెళ్ళటం! విజయ్ ఉన్నాడో, బయటికి వెళ్ళాడో కనుక్కుందామనుకుని, అతని పేరు చెప్పటం ఇష్టం లేక 'చుట్టాలు ఉన్నారా?' అని అడిగాను.

'చుట్టాలెవరూ లేరండీ!' అంటూ పరిగెత్తింది పిల్ల. నేనూ వెనుకే వెళ్ళాను. ఇప్పుడే విజయ్ ఉంటే! నా ఊహకే నాకే నవ్వు వచ్చింది.

హాల్లోకి అడుగుపెడుతూ ఆగిపోయాను. ఎదురుగుండా సోఫాలో విజయ్ కూర్చుని పేపర్ చదువుతున్నాడు. నాకు గుండె జల్లుమంది! అలాగే నిలబడిపోయాను.

విజయ్ నన్ను చూడగానే 'హల్లో! రా! రా!' అంటూ నవ్వుతూ పిలిచాడు.

అతను మామూలుగానే ఉన్నాడు. అలాంటప్పుడు నేను భయపడటం దేనికి?

నేను లోపలకు అడుగువేసి హాల్లోకి ప్రవేశించాను. 'కూర్చో!' అన్నాడు సోఫా చూపుతూ.

నేను కూర్చోకుండా, కనీసం అక్కడ ఆగకుండా లోపలికి వెళబోతూ అన్నాను 'సారీ! శారదతో పనిఉండి వచ్చాను' నీకోసం రాలేదు అన్న భావం ధ్వనింప జేస్తూ నిర్లక్ష్యంగా అతనంటే లెక్కలేనట్లు అన్నాను. అని ఊరుకోలేదు. అతని ముఖం ఎలా ఉంటుందో చూశాను. నేను ఆశించినట్లు అతను చిన్నబుచ్చుకో లేదు.

ఏవండోయ్! మీ ఆఫీసులో అందరికీ బోనసులిచ్చారటగా? ఆడుక్కోంజేసారూ?



# నువ్వంటే నాకిష్టం

'ఆ సంగతి నాకూ తెలుసుగానీ. కూర్చో వోయ్! శారద నన్ను ఇక్కడ అందుకే కూర్చోబెట్టింది. నువ్వు రాగానే రిసీవ్ చేసుకోమంది. తను లోపల పనిలో ఉంది. వచ్చేస్తుంది కూర్చో!' అన్నాడు తన మామూలు ధోరణిలో.

అయినా నేను మొండిగా 'నేనే లోపలికి వెళ్తాలే' అంటూ వెళ్ళబోయాను.

విజయ్ వెంటనే 'శారదా, శారదా!' అంటూ గావుకేకలు పెట్టి పిల్చాడు.

నేను అక్కడే నిలబడి పోయాను ఏమీ తోచనట్టు. శారద హంస నడకలతో వచ్చింది. వస్తూనే అంది.

'వచ్చావా! కూర్చో నేనిప్పుడే వస్తా స్నానం చేసి' అంటూ లోపలికి వెళ్ళబోయింది.

నాకు చాలా కోపం వచ్చింది. తను స్నానంచేసి వచ్చేవరకూ నేను ఏం చేయాలి! 'సరే! తర్వాత మళ్ళీ వస్తాలే' అంటూ వెనక్కి తిరిగాను.

శారద గబగబా వచ్చి నాచెయ్యి పట్టుకుని లాగింది, 'వెళ్ళిపోకు. నీతో చాలా అర్జెంటు పని ఉంది కూర్చో!'

నేను ఉండనా, వద్దా అని సందేహంగా చూసాను తనవైపు. 'ప్లీజ్! కూర్చో!' అంది బ్రతిమాలుతూ.

నేను ఇంక బాగుండదని సోఫాలో కూర్చున్నాను. తను 'ఇప్పుడే రెండు నిముషాల్లో వచ్చేస్తా!' అని నాతో చెప్పి విజయ్ వంకకు తిరిగి 'పద్మను ఎంటర్‌టైన్ చెయ్యి నేను వచ్చేలోగా! అన్నట్టు ఆ లత గురించి చెప్పు, నీకు విసుగు లేదుగా!' అని నవ్వి లోపలికి వెళ్ళి, మళ్ళీ వచ్చింది.

'మరిచేపోయాను! లత అంటే వీడుకో గాని పద్మకి మహా చిరాకు. ఇంకేవైనా కబుర్లు చెప్పు తనకి' అంది.

నేను కంగారుగా చూసాను విజయ్ వంక. 'నాకు లతంటే చిరాకు' అన్నదానికి అతను ఏం అర్థాలు తీస్తాడో! నేనెందుకు బయట పడలి అతనిముందు.

'ఛ! నాకు లతంటే చిరాకేమిటి? లేదానివే, ఎవరు చెప్పారు?' హడావుడిగా అన్నాను.

'మరి నువ్వు నిన్న చెబుతుంటే 'సు... కదా! ఈ విజయ్ లతగురించి చెప్పడం మొదలు పెట్టాడంటే తనకి ఒళ్ళు తెలియదు.' నవ్వి శారద వెళ్ళిపోయింది.

విజయ్, నేను దిక్కులు చూస్తూ కూర్చున్నాం కాసేపు. పరిచయం లేని వాళ్ళలా ఉంది మా వ్యవహారం!

'అంత చిక్కిపోయావేం పద్మా!' ఉన్నట్టుండి మృదువుగా అన్నాడు విజయ్!

నేను చిక్కితే ఇతనికెందుకు? లావైతే ఇతని కెందుకు? తనకీ, నాకు ఏమిటి సంబంధం?

మళ్ళీ అతనే అన్నాడు 'బొత్తిగా నల్లపూసై పోయావేం? ఎక్కడా కనబడటం లేదు.'

అంటే, ఇతను వస్తే ఎదురేగి స్వాగతం చెప్పాలా! నివాళులివ్వాలా! నేనేం మాట్లాడలేదు.

'సరే, పోన్లే! శారద నీకు కబుర్లు చెప్పుతుందిగా, నేను చెప్పను?' అని మహాబలిపురం సంగతి తీశాడు. అది మద్రాసు దగ్గర ప్రదేశమట. వాళ్ళీ మధ్యనే పిక్నిక్ వెళ్ళి వచ్చారట వాళ్ళల్లో లత కూడా ఉందట. టాపిక్ లత మీదికి మళ్ళింది. నేను మౌనంగా వింటున్నాను.

లతని గురించి ఉత్సాహంగా చెప్పడం మొదలుపెట్టాడు. నేను అతన్నే పరీక్షగా చూస్తున్నాను. ఇతనికేం సిగ్గు లేదా, బిడియం లేదా! అతనికి మనసనేది ఉందా!

విజయ్ మాటలకి నాలోని బాధ ఉవ్వెత్తున లేచింది. శక్తినంతా కూడదీసుకుని అడిగాను.

'నువ్వు, లత పెళ్ళి చేసుకుంటారట కదా?'

విజయ్ నవ్వాడు. చాలా అందంగా, తేలిగ్గా నవ్వాడు.

'ఆఁ! అందరూ అలాగే అంటున్నారు లత నాన్నగారు ఈ నెలాఖరులో ప్రపోజ్ చేస్తారట. లత చెప్పింది.' తాపీగా చెప్పాడు.

ఇతనికి బాగా బుద్ధి చెప్పాలి. ఇలాటి వాడిని కట్టుకుని ఆ లత మాత్రం ఏం సుఖపడుతుంది! ఏదైనా ఇతను సీరియస్‌గా తీసుకుంటే అంతే చాలు.

'నువ్వు లతని పెళ్ళి చేసుకుందామను కుంటున్నావా?' నెమ్మదిగా అడిగాను.

'సిల్లీ ప్రశ్న!' నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడు. లతని చేసుకోకపోతే ఇంకెవర్ని చేసుకుంటాను అన్నట్టుంది అతని వాలకం.

'నీకు లతంటే అంత ప్రేమా!' వెర్రిబిగువున అడిగాను.

అతను అదోలా నవ్వి అవునన్నట్టు తల ఊపాడు. భగ్గుమంది మనసు.

'నే నొకటి అడుగుతాను. సమాధానం చెబుతావా?' కంఠాన్ని అదుపులో పెట్టుకుంటూ అడిగాను.

విజయ్ ఇదేమీ పట్టనట్టు 'విత్ ప్లెజర్' అన్నాడు నిర్లక్ష్యంగా.

'నువ్వు ఇదివరకు ప్రేమించింది ఎవర్ని ప్రేమించావ్! ఇక ముందు ఎంతమందిని ప్రేమిస్తావ్?' చాలా కఠినంగా అడిగాను.

విజయ్ ఏమీ మాట్లాడలేదు. నా వంకే కళ్ళు విప్పార్చుకుని చూస్తున్నాడు, ఏదో నా ముఖంలో వెదుకుతున్నట్టు. నేను అనుకున్నట్టు కోపం తెచ్చుకోలేదు. చిన్నబుచ్చుకోలేదు.

నేను మళ్ళీ అన్నాను 'విజయ్! నువ్వు వెంటనే లతని పెళ్ళి చేసుకో! కానీ ఒక్క విషయం జ్ఞాపకం ఉంచుకో! నీలాగా అందరూ చంచల మనస్తత్వంతో ఉంటారనుకోకు. వాళ్ళకు మనసులున్నాయని, ప్రేమ, బాధ తెలుసునని జ్ఞాపకం ఉంచుకో...' గొంతు పూడుకుపోయి మాటలు రాలేదు ఆపైన. కన్నీళ్ళు ఉబికి వచ్చేసాయి. వాటిని ఆపడం అసాధ్యం అయింది. నేను తల దించుకున్నాను.

వెంటనే విజయ్ తను కూర్చున్న చోటు నుంచీ లేస్తూ చప్పట్లు కొట్టాడు చిన్నగా. 'సక్సెస్! గ్రాండ్ సక్సెస్! ఈ రిజల్ట్ కోసం ఎంత కష్టపడాల్సి వచ్చింది!'

అతను అంటున్నదేమిటో నాకు అర్థం కాలేదు. అతనివైపు చూసాను కళ్ళు గర్వంగా మెరుస్తున్నాయి. ముఖం వెలిగి పోతోంది.

నువ్వేమీ ఇంక చెప్పనక్కరలేదు' అంటూ నా దగ్గరగా వచ్చేసి నా ప్రక్కనే కూర్చున్నాడు.

నా బుగ్గల మీద కన్నీళ్ళు తుడిచాడు చొరవగా. నేను ప్రతిఘటించే స్థితిలో లేను.

'పిచ్చి పద్మా! నీకోసం చూడు ఎంత

నాటకం ఆడవలసి వచ్చిందో! ఒక అతని సృష్టించి, ఒక ప్రేమ కథని అల్లి... అబ్బబ! విసుగేసింది.!

నేను ఆశ్చర్యంగా విజయ్‌కేసి చూసాను. "నిజంగానా! ఇదంతా నాటకమేనా?" నమ్మలేనట్టు అడిగాను.

అతను మృదువుగా చెప్పాడు 'నిజం పద్మా! నీకోసం ఇంత నాటకం ఆడవలసి వచ్చింది!'

నావంక పరీక్షగా చూసి మళ్ళీ అన్నాడు 'సారీ పద్మా! నిన్ను బాధపెట్టాను కదూ? నిన్ను బాధపెట్టి, నేను బాధపడి.. ప్చ్! దీనికంతకూ నువ్వే కారణం!'

నా మనసు చాలా తేలిక అయ్యింది. సంతోషం పట్టలేకుండా ఉన్నాను. ఇన్నాళ్ళూ నేను పడ్డ బాధ క్షణంలో మాయం అయింది.

కొస్త ఆగి విజయ్ అన్నాడు 'దీనికంతకూ నీ మొండితనం కారణం! నిన్నేం చెయ్యాలి.' అన్నాడు. నేను అదోలా చూస్తూ.

నేను తల దించుకున్నాను.

'అన్నట్టు శారదకి నా ంచి ప్రెజెంట్ ఏదైనా ఇవ్వాలి. తను నాకు చాలా సహాయం చేసింది!' అన్నాడు విజయ్ నవ్వుతూ.

అంటే, ఇద్దరూ కలిసి ఆడిన నాటకం అన్నమాట ఇది! నాకు కోపం వచ్చింది! పిల్ల దగ్గరికి ఇటులా ఉంటేనేగాని, నేనెంత బాధపడ్డానో వీళ్ళకేం తెలుసు! నేను లేచి పెళుగాగులు వేసాను.

నా మనసులో భావం అర్థం అయినట్టు విజయ్ అన్నాడు 'ఏంచెయ్యను చెప్పు మరి, నువ్వు నన్ను ఉత్తరాలకి జవాబులు రాయక పోతే! నిన్ను ఒప్పించడానికి ఇంతకంటే మార్గం కనబడలేదు. పని వంకపెట్టు కుని అందుకే వచ్చేసాను ఇక్కడికి.'

మళ్ళీ అన్నాడు 'ఇంతకీ అసలు విషయం చెప్పు! ఇప్పటికైనా ఒప్పుకున్నట్లేనా పెళ్ళికి.'

వాడగ్గరగా వచ్చేస్తున్నాడు. నాకు సిగు వేసింది. అక్కడినుంచి ఒక్క పరుగున గేటువరకూ వచ్చేసి, వెనక్కి తిరిగి చూసాను. అతను బయటికి వస్తూ నావంకే చూస్తున్నాడు నవ్వుతూ. ●

(అయిపోయింది)

---

రసవర్గాలూ - గుణాలూ :

## ఆవాలు

సాధారణంగా మనవాళ్ళు పోపులన్నింటిలోనూ తగుమాత్రం ఆవాలు వాడుతుంటారు. ఇకపోతే ఆవపెట్టి కొన్ని కూరలు పులుసు వండుతుంటారు. కొన్ని ఊరగాయలలో ఆవగుండ వాడుతుంటారు.

ఈ ఆవాలలో ఎరుపు, నలుపు, తెలుపు, రంగులుగల మూడు జాతులు ఉన్నాయి. ఇక పోతే సన్నావాలుకూడా కొన్ని ప్రాంతాలలో అధికంగా పండుతుంటాయి.

ఇవి కాకచేస్తాయి. కఫం, వాతం, రేచీకటి, అజీర్ణం, శుక్లవాతం, శ్వాస, శూల, పీనస, అగ్నిమాంద్యం, దురదలు, దద్దుర్లు విసర్పి వీనిని పోగొట్టడానికి తోడ్పడతాయి. ధాతువులకు బలాన్ని చేకూరుస్తాయి. మెదడులోని చెడు నీరును ఆర్పివేస్తాయి. జీర్ణశక్తిని పెంపొందించి ఆకల్ని పుట్టిస్తాయి. కడుపులోని వాతాన్ని హరిస్తాయి. కుష్టు, క్రిమి పక్షవాతం, ఉదర రోగం గలవారికి మేలు చేస్తాయి.

అతి త్రాగుడుచే స్మృతి తప్పి పడియున్న వారికి, ఏదైనా విషపదార్థం తినినవారికి గురుత్వ పదార్థాలనుగాని, సులభంగా జీర్ణం కాని కఠిన పదార్థాలుగాని, అమితంగా తినిన వారికి వాంతి చేయించడానికి ఆవాలను ఉపయోగించవచ్చు. తగు మోతాదులో బాగా నలుగగొట్టబడిన ఆవాలను ఒకటి రెండు డ్రాముల చన్నీళ్లతో లోనికి యిచ్చిన మనిషిని నీరస పరచకుండా వాంతి చేయించి, కడుపును శుభ్రపరచును.

ఆవాలను నలుగగొట్టి, వేడినీళ్లతో చేసిన తేలిక కషాయం, పూటకు నాలుగైదు సార్లు చొప్పున కొన్ని దినములు యిచ్చినట్లయితే పక్షవాతం తగ్గుతుంది.

ఆవాల్ని నలుగగొట్టకుండా పూటకు సుమారు ఒక టేబుల్ స్పూన్‌ఫుల్ చొప్పున ప్రొద్దుట సాయంత్రం ఉదర రోగులకు చన్నీళ్లతో మ్రింగించిన అధికంగా మూత్రం వెలువడుతుంది. విరేచన మవుతుంది. పొట్టకు బలం చేకూరుతుంది. ఆకలి పుడుతుంది.

ఆవాల చూర్ణంలో నీళ్ళుగాని, సిరికాగాని, పోసి బాగా కలిపి వాత నొప్పులచోట పట్టు వేసిన లేక మర్దన చేసిన వాతనొప్పులు తగ్గుతాయి.

ఆవాలు పైత్యాన్ని, రక్త పైత్యాన్ని, వృద్ధిపొందిస్తాయి. వీనియొక్క దుర్గుణాలకు విరుగుళ్లు:— 1. నెయ్యి. 2. కలినీళ్ళు. 3. పెరుగు.

సన్నావాలకుకూడా చాలా వరకు ఆవాలకు గల గుణాలే ఉన్నాయి. ఇవి పెద్దావాలుకంటే శక్తివంతంగా పనిచేస్తాయి.

## మెంతులు

మనవాళ్ళు కొన్ని కూరలు మెంతి పెట్టి వండుతుంటారు. మెంతులు వేడిచేసి ఆర్పుతాయి. దేహశాంతి చేకూరుస్తాయి. వీపు నొప్పిని లివర్‌నొప్పిని, తగ్గిస్తాయి. ధాతువులకు బలాన్ని చేకూరుస్తాయి. స్త్రీల ఋతురక్తాన్ని బాగా జారీ చేయిస్తాయి. స్తన్యనకు సత్తువను చేకూరుస్తాయి. దగ్గును, కఫాన్ని హరిస్తాయి. హృదయాన్ని శుభ్రపరుస్తాయి.

వేయించిన మెంతుల తేలిక కషాయం తగు మోతాదులో ఉదయం సాయంత్రం త్రాగినా మెంతులు వెన్నలో కలిపి తిన్నా— రాత్రి పడుకోబోయేముందు నీళ్లతో తగుమోతాదులో మెంతులు పుచ్చుకున్నా రక్తగ్రహణి కడుతుంది. చిన్న నిమ్మకాయంత వెన్నలో ఒక ఉల్లిపాయను సన్నంగా తరిగి తగుమోతాదులో మెంతులు కలిపి ఉదయం, సాయంత్రం తగు మోతాదులో తిన్నట్లయితే గ్రహణి, రక్త గ్రహణి, కడతాయి. మెంతులు అచ్చంగా కాని, వెన్న మొదలగువానితో గాని పుచ్చుకొనెడి మోతాదు $\frac{1}{8}$ తులం మొదలు అర తులం వరకు. మెంతుల్ని నమలకుండా మ్రింగాలి.

మెంతుల పిండిని నీళ్లతో ఉడికించి గెడ్డలపై వేసి కట్టు కట్టినట్లయితే అవి శీఘ్రంగా మెత్తబడి చితుకుతాయి. ఈ పిండిని వేసి ముల్లు విరిగిన చోట కట్టినట్లయితే ముల్లు సులభంగా ఊడివస్తుంది.

మెంతులు అమితంగా తింటే పైత్యవికారం ఎక్కువవుతుంది. తలనొప్పి వస్తుంది.

దీని యొక్క దుర్గుణాలకు విరుగుళ్లు:— 1. పులుసు. 2. పుల్లదానిమ్మ, 3. మేక కడుపులోని పిల్ల మాంసము 4. సికంజబీను.

సేకరణ: ఆకుండి నారాయణమూర్తి




'ఆవేశంగా' బాండ్ ఒక్కసారిగా ఎగిరాడు. ఇటువక్కవాడి పొట్టలో ... డు. ఆ వక్కవాడి నెత్తి మీద ... డిష్కుం, డిష్కుం, ఢాం ఢాం ... టాలు ఎగిరిపోయాయి. బ్బ! ... టుగురూ ... చూడాల్సిందేగాని చెప్పే మనుకో. ఇందులో ఏముందంటే...' సుబ్బారావు ఊపిరి పీల్చుకునేందుకు ఒక క్షణం ఆగాడు.

అంతవరకు మాంచి హుషారుగా 'ప్రత్యక్ష జేమ్సు బాండీయం' వింటున్న శ్రోతలు మూతులు బిగించి మొహాలలో గంభీరత ప్రదర్శించుకుని ... ఉన్నారు. ఈ హఠాత్పరిణామము సుబ్బారావుకు ఆశ్చర్యం కలిగించింది.

అంతలో 'నేను చెప్పనా తరువాత ఏమయిందో' అంటూ ఒక అశరీరవాణి పలికింది. ఆ మాటలు పూర్తి కాకుండానే సుబ్బారావు గుండెకాయ నోట్లోకి వచ్చేసింది. ఆ అశరీరవాణి ఆఫీసరురూపంలో సుబ్బారావు పక్కకువచ్చి 'మాడు సుబ్బారావ్, జేమ్సుబాండ్ సినిమాలంటే నీకు చాలా ఇష్టం అనుకుంటాను' అన్నాడు.

'మరేనండి' సిగ్గు పడిపోయినట్లు చెప్పాడు సుబ్బారావు.

'మరెందుకొచ్చిన ఉద్యోగం; సుబ్బరంగా సినిమాల్లో చేరేసేరాదూ.'

సుబ్బారావు సమాధానం చెప్పే స్థితిలో లేడు. అంతలోనే ఆఫీసరు 'ఇదిగో ఈ సాయంకాలంలోగా రికన్సిలియేషన్ స్టేటుమెంటు పూర్తి కాకపోతే, రేపటినుంచి నీ మకాం సినిమాహాలులోనే ఏర్పరుచుకోవచ్చు తెలిసిందా' అన్నాడు.

సరిగా ఆ క్షణంలో మిస్ మేరీ సువంద ఆఫీసులో అడుగుపెట్టింది. అడుగుపెడుతూనే 'మే ఐ కమిన్' అంది. ఆవిడ రాక ఉరుములతో జడివాన కురిసి వెలసిన తర్వాత వచ్చిన ఇంద్రధనస్సులాగా ఉంది. ఆవిడమాట వేయి వీణలు ఒకేసారి పలికినట్లు కోటికోయిలలు ఒకేసారి కూసినట్లు ఉన్నది. ఆఫీసు యావత్తూ ఒక్కసారిగా స్తంభించి పోయింది.

ఆ క్షణంలో ఆఫీసు ఎట్లా ఉన్నదంటే......డచ్చివారో ఇంకా వారికి పూర్వం మనదేశానికి వలస వచ్చిన వారో కట్టిన ఆ భవనం మాదలఫకీరు గృహంలాగా ఉన్నది. మట్టి కొట్టుకుపోయిన గోడలనిండా వేలాడుతున్న బూజు మంత్రాల మర్రి ఊడలలాగా ఉన్నాయి. సరియైన పద్ధతిలో కాకుండా ఇష్టం వచ్చిన రీతిలో నిలబెట్టిన బీరువాలు అడవిలో ఏపుగా పెరిగిన చెట్లలాగా ఉన్నాయి. కనీసం నడవడానికయినా దోవలేకుండా అమర్చబడిన డ్రాయర్లు, బల్లలు, కుర్చీలు హద్దూపద్దూ లేకుండా పెరిగిన దుబ్బులాగా ఉన్నాయి. ఎక్కడపడితే అక్కడ పడవేసిన ఫైళ్లు, కాగితాలూ, ఎండి రాలిన ఆకుల గుట్టలలాగా ఉన్నాయి. ఒక్క

# సునందోపాఖ్యానము

పొ తలో చెప్పాలంటే ఆ ఆఫీసు ఆనాటకూ 'శాకులు దూరని కారడవి చీమలు దూరని చిట్టడవి' లాగా ఉన్నది. ఆ అడవికి మృగరాజు వంటివారు ఆఫీసరు నరసింహంగారు. ఆయన వివాహితుడూ మాట్లాడరు, గర్జిస్తారు. హెడ్ గుమాస్తా శక్కువినయ భూషణం గారు ఆ రాజ్యానికి ప్రధానమంత్రి. పేరుకు తగ్గట్టు, ఆయన 'మూర్తీభవించిన వినయమా ఏమిటి చెప్మా' అన్నట్లుగా ఉంటారు. ఆఫీసులోని తక్కిన గుమాస్తాలందర్నీ తలొక జంతువుతోనూ పోల్చవచ్చును.

మిస్ మేరీ సునంద ఆ ఆఫీసుకి స్టెనో గ్రాఫరుగా బదిలీ అయి వచ్చింది. ఆమె ట్రాన్స్ఫరు అయిన రోజును యుగ సంధి అనుకుంటే, అంతకు పూర్వపు రోజుల్ని పాత రాతియుగంతో పోల్చవచ్చు. ప్రస్తుతము ఆ పాత రాతియుగము హఠాత్తుగా ఇరవయ్యో శతాబ్దానికి మారిపోయినట్లుగా ఉన్నది. ఈ మార్పు ఆఫీసు బాహ్య స్వరూపంలో ఏమంత కనిపించలేదు గాని, సిబ్బందిలో మాత్రం స్పష్టంగా కనబడుతోంది. అమావాస్యకు ఒకసారి, పౌర్ణమికి ఇంకోసారి గడ్డం గీయించుకునే ఒక రంగారావు ఇప్పుడు రోజూ చక్కగా క్షవరం చేసుకుని వస్తున్నాడు. బిడ్డు కారే ముఖంతో ఈదురోమంటూ ఉండే ఇంకో రాఘవరావు ఇప్పుడు చక్కగా ముస్తాబై వస్తున్నాడు. ఆఫీసులో ప్రతి వ్యక్తికీ ఇప్పుడు పనంటే శ్రద్ధ ఏర్పడింది. ఇదివరకు కాంటీన్ లో ఎక్కువగా కనపడే గుమాస్తాలు ఇప్పుడు సీటు వంటిపెట్టుకొని కూచుంటున్నారు. కాంటీన్ చిన్నపోతోంది.

సుబ్బారావు అందరికన్నా ముందుగా ఆవిడ పరిచయభాగ్యం సంపాదించాడు. ఆవిడ చేరిన రోజునే 'ఇక్కడి ఆచారం ప్రకారం మీరు అందరికీ కాఫీ పోయించి మరీ పరిచయం చేసుకోవాలి' అన్నాడు.

'నేను ఇక్కడికి కొత్త కదా. కాఫీ మీరే తెప్పించి అందరికీ పరిచయం చేయండి. నేను బిల్లు పే చేస్తాను.' అన్నది సునంద.

ఏ బాధనైనా సహించవచ్చును గాని మన తోటి వ్యక్తి ఒకరి పరపతి తెగ పెరిగి పోతోంటే సహించటం చాలా కష్టం. సుబ్బారావు పరపతి క్షణక్షణంగా పెరగటం అతని స్నేహితుడు రాజారావుకు నచ్చలేదు. సుబ్బారావులాగా అతను ముందుగా చొరవ తీసుకోలేదు. తనకు అటువంటి అవకాశం రాకుండా పోతోందే అని చాలా విచారించేడు. అయితే రెండురోజుల తర్వాత తనుంటున్న వీధిలో ఒక ఇల్లు అద్దెకు రావటంతో అవకాశం వచ్చింది. రాజారావు అర్జంటు ఉత్తరం ఒకటి టైపు చేయించుకునే మిషతో సునంద దగ్గరకు వెళ్ళి, 'ఎక్కడ ఉంటున్నారు' అని అడిగాడు.

ఎందుకని అడిగింది సునంద.

'ఏమీ లేదు మీకు అన్నివిధాలా వీలుగా ఉండే ఇల్లొకటి మా వీధిలో ఖాళీగా ఉన్నది. వచ్చి చూసుకుంటారా' అన్నాడు. కాని అప్పటికే ఇంటిగురించి నలుగురు చెప్పారని అతనికి తెలియదు.

'చూడండి మిస్టర్ నా ఇంటి గురించి మీ అందరికీ ఇంత శ్రద్ధ ఎందుకో నా కర్థం కాలేదు. నాకు ఇల్లు కావాలంటే నేను చూసుకోగలను. నాకు మీ సహాయం అక్కరలేదు' అన్నది. అంతసందిలో తనను ఆనిపించగా అనటం అతనికి బాధ కలిగించింది. రెండురోజులవరకు అతను ఆ 'షాక్' నుంచి తేరుకోలేదు.

ఇటువంటి విషయాలలో ఓటమి అంగీకరించటానికి మనస్సు అంత తేలికగా ఒప్పుకోదు. రాజారావు నిరుత్సాహపడకుండా ఆవిడ అభిమానాన్ని సంపాదించటానికి ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు. అందుకనే ఒకరోజు సుబ్బారావు 'ఏమిటి రాజూ నిన్న గుంటూరువారి పేటలో తిరుగుతున్నావు. మనవాళ్ళెవరూ అక్కడ ఉంటున్నట్లు లేదే' అని క్యాంటీన్లో పట్టుకుని అడిగినప్పుడు రాజారావు ఉలిక్కిపడ్డాడు. 'అబ్బే మావాళ్ళెవరో ఉంటేనూ' అనబోతూ నవ్వుకున్నాడు. 'అవునూ మనవాళ్ళెవరూ లేనప్పుడు సుబ్బారావుకు మాత్రం అక్కడ పనేమిటి' అనుకున్నాడు. ఆ సంగతే పైకి అనేశాడు. సుబ్బారావుకు కూడా మా బంధువు లెవరో ఉన్నారన్న సమాధానం స్ఫురించింది కాని, పైకి చెప్పలేకపోయాడు.

వాతావరణం ఇంత ఉద్రిక్తంగానూ ఉండగా ఆశ్చర్యకరమైన సంఘటన ఒకటి జరిగింది. ఒకరోజు మధ్యాహ్నము 'సుబ్బారావుగారూ ఇవాళ సాయంకాలం మీకేమైనా పనుందా' అని అడిగింది సునంద.

'అబ్బే ఏమీ లేదండీ' అన్నాడు సుబ్బారావు.

'అయితే సాయంకాలం మా ఇంటికి టీకి రావాలి మీరు' అని ఆహ్వానించింది.

హెడ్ గుమాస్తా శక్కువినయ భూషణం గారు ఆఫీసరుగారు తన మీద దాడిలు చెప్పటం ఆ క్షణం నుంచి మానివేశారని తెలిసేగా; ఆఫీసరు నరసింహంగారు అందర్నీ చిరునవ్వుతో పలకరించి సాయంకాలంలోగా స్టేటుమెంట్ పూర్తి కాకపోయినా ఫరవాలేదని అభయమిచ్చినా ఆఫీసులో ఎవరూ ఇంతగా ఆశ్చర్యపడి ఉండేవారు కాదు. సుబ్బారావు అదృష్టానికి సంతోషించని వారు ఆఫీసు సిబ్బందిలో ఒక్క రాజారావు మాత్రమే. ఆరోజు అతను సంతాపదినం జరిపాడు. సుబ్బారావును తన ఆజన్మ శత్రువులలో జమకట్టేశాడు.

కాని మర్నాడు ఆమె రాజారావునుకూడా టీకి ఆహ్వానించింది. ఇది మరీ విడ్డూరంగా కనిపించింది. వినయ భూషణంగారు వినయసంపత్తి, ఆఫీసరుగారి కార్యదక్షత

## ఓం నమః శివాయ

కం. యధార్థవాది నే నన్ను
యాతనలేని నిష్కళంకనిర్భయ అతివ
యుంకెన్నాళ్ళు నిరీక్షణ
యీ విస్తార, సంసార, సాగర భార
మయ్యెన్

కం. యువతి, మానవతి గతిని
యూరక నిర్లక్ష్యించక శిక్షించక
కళానిధి
య్యా వృద్ధను విచలితనై
య్యా, వృధా వేదనలో నల్గినరులు
మంటిన్

కం. యెచట చూచిన లింగరూ
యేవిధముగదల్చిన నీ నామమే మదిన్
య్యె త్మైమని సోకు చెవి
యొకలంతయు పులకాంకిత తన్మ
యత్వం బొందున్

కం. యోగాభ్యాస, యోగిని
యౌవన మంతరించె మదియు వృదు
మహేశా
యంత ధన్యను నందీశా
యః పతే, పార్వతిలింగా, నమో
నమః శివాయ॥

రచయిత్రి శ్రీమతి సరస్వతి గిరి

# మీకు ఏ కారణము వల్ల తల నొప్పి వచ్చినా అది ఒకే ఒక సారిడన్‌తో మటుమాయమై పోతుంది

ఒకే ఒక సారిడన్ నొప్పిని త్వరగా పోగొట్టుతుంది. ఇంతేగాక, అందులో వున్న ప్రత్యేక పదార్థముల వలన సారిడన్ తల నొప్పి, ఒంటి నొప్పి లేక పళ్ల నొప్పితో బాటు కలిగే భారమును పోగొట్టును మరియు మీకు హాయి నవోత్సాహమును కలిగించును. అదే సారిడన్ ప్రత్యేకత।

**సారిడన్**

'రోష్'

ముక్కు దిబ్బడ వేయుట లేక విపరీతంగా రొంప పట్టుట వలన
తల నొప్పి

ఎక్కువగా పని చేయుట లేక మామూలు అలసట వలన
తల నొప్పి

భరించ లేని గొడవ వలన
తల నొప్పి

కళ్ళ భారము లేక ఎక్కువగా చదువుట వలన
తల నొప్పి

ఎండ వేడి వలన
తల నొప్పి

ఎక్కువ ఆలోచన లేక బెంగ వలన
తల నొప్పి



A·VT·8420.

'రోష్' తయారీ ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వోల్టాస్

# సునందోపాఖ్యానము

వంటి విషయాలే కాకుండా ఆఫీసులో చర్చించటానికి ఒక కొత్త విషయం లభించింది. తరువాత వివరి వంతు వస్తుందో ఊహించటంలో నిమగ్నులైనారు.

మర్యాద ప్రకారం సునందను టీకి రావలసిందిగా ఆహ్వానించటం కనీస ధర్మం కదా. అయితే సుబ్బారావు ఆమెను ఆఫీసులో అందరి ఎదుటా పిలువదలుచుకోలేదు. అందుకని ఆవిడ ఇంటికి బయలుదేరాడు. రాజారావుకు కూడా సరిగ్గా ఇదే ఆలోచన వచ్చింది. సునంద ఉంటున్న వీధి ఆచివర చివర సుబ్బారావు అడుగు పెట్టిన సమయానికి రాజారావు వీధి ఈ చివర కొచ్చేశాడు.

సరిగ్గా అదే సమయానికి సునందతో ఒక గడ్డం మేష్టారు మాట్లాడుతున్నాడు. జాగ్రత్తగా పరిశీలిస్తే ఆ సంభాషణ సరియైన పంథాలో సాగుతున్నట్లు లేదు. సునంద చాలా విసురుగా నడుస్తున్నది. గడ్డం మేష్టారు ఆమెను అనుసరిస్తూ ఏదో మాట్లాడేస్తున్నాడు. సునంద ఇంటి దగ్గరకు రాగానే అతను హఠాత్తుగా ఆమె చేయి పట్టుకున్నాడు. ఆమె చేయి విదిలించుకుని లోపలికి వెళ్ళిపోయింది.

వీధి ఆ చివర ఉన్న సుబ్బారావుకూ ఈ చివర ఉన్న రాజారావుకూ కోపం వచ్చింది. నిజానికి పట్టపగలు నడిరోడ్డు మీద సినిమాలో విలన్‌లాగా ఉండే ఒక గడ్డపు మేష్టారు ఒక అబలతో, అందులోనూ తమతో ఆఫీసులో పని చేసే వ్యక్తితో అనుచితంగా ప్రవర్తిస్తుంటే ఎవరికైనా కోపం వస్తుంది. వీధి ఆ చివర రాజారావును గమనించక పోయినట్లయితే సుబ్బారావు ఏమి చేసేవాడో చెప్పటం కష్టం. కాని ఇప్పుడు మాత్రం సుబ్బారావు పరిగెత్తుకుంటూ వచ్చేశాడు.

గడ్డపు మేష్టారు ఒకటి రెండు నిముషాలు తటపటాయించి వెళ్ళిపోవటానికి వెనక్కు తిరిగాడు. ఎదురుగా సుబ్బారావు ఉన్నాడు.

'హలో' అన్నాడు సుబ్బారావు.

గడ్డపు మేష్టారికి ఆశ్చర్యం వేసింది. ఏమీ మాట్లాడకుండా ముందుకు నడిచాడు.

'వెయిట్' అన్నాడు సుబ్బారావు.

అతను ప్రశ్నార్థకంగా సుబ్బారావు ముఖంలోకి చూశాడు.

'ఎవ్వరు మనది' అని అడిగాడు సుబ్బారావు.

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాల్సిన అవసరం కనపడలేదు.

'ఎవ్వరైతే మీకే' అన్నాడు.

'అవున్లే రోడ్సైడు రోమియోలకు ఒక వూరంటూ ఉండదుగా' అప్పటికి రాజారావు కూడా దగ్గరకు వచ్చేశాడు. అందుకని ధైర్యంచేసి అనేశాడు సుబ్బారావు. ఈ సంభాషణ అట్టే అంత సాఫీగా సాగటం లేదు. అందుచేత 'షటప్' అన్నాడు గడ్డం మేష్టారు.

'యూ షటప్' అంటూనే చేయి విసిరాడు సుబ్బారావు.

దెబ్బ తగలగానే అతనికి బాగా కోపం వచ్చింది. గబగబా రెండు చేతులతోనూ నాలుగైదు దెబ్బలు సుబ్బారావుమీద వడ్డించాడు.

ఒక నిముషంవరకు జరుగుతున్నదేమిటో రాజారావుకు బోధపడలేదు. అతనికి తెలిసే లోగానే సుబ్బారావు నాలుగైదు దెబ్బలు తినేశాడు. ఏమీచేయలేక రాజారావు గడ్డపు మేష్టారిని గట్టిగా పట్టుకున్నాడు. ఆ క్షణంలో సుబ్బారావుకు అద్భుతమైన ఆలోచన వచ్చింది. ఇలాంటి సమయంలో జేమ్సుబాండ్ ఏమిచేసి ఉండేవాడో ఊహించాడు. ఎగిరి ఒక తన్ను తన్నారు. రాజారావు గట్టిగా పట్టుకుని ఉండటంచేత గడ్డపు మేష్టారికి తప్పుకునేందుకు వీలు లేక పోయింది. రాజారావుతో సహా కిందపడ్డాడు. అతను లేచేలోగా సుబ్బారావు ఇంకో తన్ను తన్నాడు. పొట్టలో తగలటంచేత అతను బాధతో—

'అమ్మా' అన్నాడు. సుబ్బారావు విజృంభించాడు. కాలరు పట్టుకుని అతన్ని లేవదీశాడు. ఈసారి అవకాశం రాజారావు తీసుకున్నాడు. వీపుమీద గుద్దుతున్నాడు.

ఇంతలో...

'మీకేమైనా బుద్ధుందా. ఒక మనిషిని పట్టుకుని ఇద్దరు కొడతారా. మీరు మనుషులేనా' అంటూ సునంద వారి దగ్గరకు వచ్చింది. వస్తూనే గడ్డపు మేష్టారిని పట్టుకొంది. సుబ్బారావు ఊహించని పరిణామం ఇది.

'అది కాదు సునందగారూ...' అంటూ

ఇకా చెప్పలేకపోతూరా... 'నాకు ... తెలుసు మీరేం చెప్పక్కర్లేదు' అని అతన్ని నడిపించుకుంటూ ఇంట్లోకి తీసుకు వెళ్ళింది. ప్రపంచం ... తలక్రిందులైనట్టనిపించింది. సుబ్బారావు, రాజారావు లిద్దరూ అయోమయావస్థలో పడిపోయారు.

మర్నాటికి కూడా వాళ్ళిద్దరూ అదే పరిస్థితిలో ఉన్నారు. ఆ రోజు సాయంకాలం కోమల విలాస్‌లో కాఫీ కోసం నిరీక్షిస్తుండగా వాళ్ళ దగ్గరకు చక్కగా డ్రస్ చేసుకొని మర్యాదస్తుడిలాగా ఉన్న ఒకాయన వచ్చాడు. వస్తూనే—

'నన్ను కొట్టింది మీరే కదూ' అన్నాడు.

సుబ్బారావుకు మతిపోయింది. 'ఇతని ముఖం మొహం ఎరగను కదా, కొట్టానంటాడేమిటి... ఒకవేళ నిన్నటి గడ్డపు మేష్టారు కాదు గదా ఇతను' అనుకున్నాడు. ఈ ఊహ రాగానే సుబ్బారావు ప్రాణాలు పైనే పోయాయి. అయినా పైకి మాత్రం, 'మిమ్మల్ని మేము కొట్టడమేమిటి మాష్టారూ... పొరపాటు పడి ఉంటారు' అన్నాడు.

అతను కుర్చీలో కూచుంటూ 'అదేమిటి అట్లా అంటారు. నిన్న సునంద ఇంటి ముందర కొట్టలేదూ' అన్నాడు.

రాజారావుకు అప్పటికి అర్థమయింది. 'మరి మీ గడ్డం ఏది మాస్టారూ' అన్నాడు.

'అదా! తీయించేసాను.'

సుబ్బారావు మాత్రం 'వెరీ సారీ మేస్టారూ మేం కావాలని కొట్టలేదు. సింపుల్ మిస్ అండర్‌స్టాండింగు అంతే' అన్నాడు. అయినా ఇతనుండిలోనూ కొడతాడేమోనని భయంగా ఉన్నది.

అతను ఈ మాటలు పట్టించుకోలేదు. 'నా పేరు చెప్పలేదు కదూ. శామ్యూల్ ఆనందరావు' అన్నాడు. ఇంతలో కాఫీ వచ్చింది. ఆ కాఫీ ఆనందరావే అందుకున్నాడు. రెండు కాఫీలకు మూడు చేసి 'నిన్న మీరు నాకు అనుకోకుండా చేసిన సహాయానికి ఇది నా కృతజ్ఞత. ఈ కాఫీకి బిల్లు నేనిస్తాను' అన్నాడు.

'మేస్టారు రిడిల్సు మాట్లాడుతున్నారు.'

'అట్లే లేనండి, మీకొక కథ చెప్తా వినండి.'

'సునంద ఇక్కడికి ట్రాన్స్‌ఫరు కాక పూర్వం మా ఊళ్ళోనే ఉండేది. నేను-ఆమె ప్రేమించుకున్నాం. మేరేజి ఎంగేజిమెంటు కూడా అయిపోయింది. ఇంతలోగా ఆమెకు ఈ ఊరు ట్రాన్స్‌ఫరు చేసారు. ఆ ట్రాన్స్‌ఫరు రద్దు చేయించాలని చాలా ప్రయత్నించాం కూడాను.'

'ఉన్నట్టుండి ఒక రోజు ఎంగేజిమెంటు కాన్సిల్ చేస్తూ ఒక ఉత్తరం రాసింది. ఆ మర్నాడే అక్కడ ఆఫీసులో రిలీవ్ అయింది. నాకేమీ అర్థం కాలేదు. ఎంగేజిమెంటు ఎందుకు రద్దు చేసిందో, నేను చేసిన తప్పేమిటో నాకు ఎంత ఆలోచించినా బోధపడలేదు. ఆమె మహా పట్టుదల మనిషి, ఏదైనా ఒక నిర్ణయానికి వస్తే మార్చటం చాలా కష్టం. రెండు మూడు ఉత్తరాలు రాసాను. సమాధానం లేదు.'

'అసలు విషయమేమిటో ముఖా ముఖీ తేల్చుకుందామని ఈ ఊరొచ్చాను. కలుసుకుందామని ఎంత ప్రయత్నించినా వీలుపడనివ్వలేదు. ఒంటరిగా వెళ్తుంటె ఎక్కడ పలకరిస్తానో అని రోజూ ఆఫీసునుంచి వచ్చేటప్పుడు మిమ్మల్నెగా ఫోలు వెంటపెట్టుకుని వచ్చేది. రెండు రోజులుగా ఇదే వరస.

# తప్పక చూడండి!

50 లక్షల రూపాయల వ్యయంతో ఈస్ట్‌మన్ కలర్‌లో
నిర్మింపబడిన మహత్తర పౌరాణిక చిత్రం!!

శ్రీ ఉమా ప్రొడక్షన్స్

# ఆదిపరాశక్తి

(ఈస్ట్‌మన్ కలర్)





'బుల్లెమ్మ—బుల్లోడు'లో చలం, విజయలలిత.

## పవిత్ర హృదయాలు

## సినిమా

సితార్ వాయించడంలో ఎన్టీ రామారావు సిద్ధహస్తుడు. భారతంలోనేగాక విదేశాల్లో కూడా ఆయనకు ప్రేక్షకులు జేజేలు కొట్టారు. యావత్ ప్రపంచంలోనే పేరుమోసిన సితారిస్ట్‌గా ఎన్టీఆర్ గుర్తింపబడ్డారు.

ఫ్రాన్స్‌లో తనపాటు కచ్చేరీలతో అక్కడి ప్రజలను రంజింపచేసి వారి అమోఘ ఆదరణను ఆశీర్వాదంగా పొంది ఎన్టీఆర్ స్వదేశానికి తిరిగివచ్చారు.

తన మనవడు సితార్‌లో మహా విద్వాంసుడు అయినందుకు నాగయ్య ఆనందభరితుడయ్యాడు. ఎన్టీఆర్ ప్రజ్ఞాపాటవాన్ని తన మిత్రులకు తెలియచెయ్యాలనుకున్నాడు నాగయ్య. అందుకే ఒకరోజున తన భవంతికి రమ్మని ఆవూరి పెద్దలకు, స్నేహితులకు ఆహ్వానం పంపాడు.

ఆహూతులకు రామారావు నమస్కరించారు. సితారును పలికించారు. ఆ పలుకును నారాయణరెడ్డి కలం చిందించింది ఏమని?

'నామది పాడిన ఈ వేళలో—నవ
జీవనవాహిని పొంగేనులే'—

ఈ పాటకు చలపతిరావు సమకూర్చిన సంగీతం మధురాతి మధురంగా వుంది. ఈ దృశ్యం శ్రీ విజయ వెంకటేశ్వరా పిక్చర్స్ 'పవిత్ర హృదయాలు' చిత్రంలో హైలైటుగా వుంటుంది. నిర్మాత సి. ఎస్. రాజు వ్రాసిన కథకు పినిశెట్టి మాటలను సమకూర్చారు.

ఎ. సి. త్రిలోకచందర్ దర్శకత్వంలో సర్వాంగ సుందరంగా తయారవుతున్న పవిత్ర హృదయాలు చిత్రానికి కె. ఎస్. ప్రసాద్ ఛాయాగ్రహణం పెద్ద ఎస్సెట్ అనే చెప్పాలి. ముఖ్య పాత్రలను రామారావు, గుమ్మడి, నాగయ్య, సత్యనారాయణ, రాజబాబు, అల్లు రామలింగయ్య, ధూళిపాళ, మిక్కిలినేని, సీతారాం, జయకృష్ణ, బ్రహ్మాజీ, కె. వి. చలం, రమేష్, జమున, చంద్రకళ, శాంతకుమారి, సంధ్యారాణి, ఉదయలక్ష్మి, పద్మాఖన్నా పోషిస్తున్నారు.

* * *

అది ఒక చిన్న యిల్లు. ఆ యింటికి అన్నపూర్ణ యజమానురాలు. ఆమెకు ఒక్కగా నొక్క కుమార్తె వుంది. పేరు వాణి; మూగపిల్ల. (పాపం) వాణి తన గదిలోనుంచి వీధిలోకి రాబోతుంటుంది అదే సమయానికి వేణు వీధిలోనుంచి యింట్లోకి వస్తాడు. తన బావను చూసి వాణి యింట్లోకి వెళ్తుంటుంది.

## సావిత్రికి శోభన్ బహుమానం

వాణీ, వాణీ, ఆ, ఇవి నీకు; అని అక్కకు అంటూ తన చేతనున్న రెండు పాకెట్స్ ఇస్తాడు వేణు. తన అక్క దగ్గరకు వెళ్ళి 'నాకు వుద్యోగం వచ్చిందక్కా' అని ఆమె పాదాలకు నమస్కరిస్తాడు. ఆమె అనుమానిస్తూ నిజంగానా అని ప్రశ్నించింది

'అనుమానిస్తున్నావా అక్కా! నీ తమ్ముడు తెలీక తప్పు చేసినా, తెలుసుకున్న తర్వాత, నీకు మాటిచ్చిన తర్వాత మరలా ఆ తప్పు చేస్తాడక్కా' అంటాడు వేణు. 'ఈ తమాషా చూసావా, అక్కా! నన్ను ఎక్కడైతే వుద్యోగం లేదు పొమ్మన్నారో, అక్కడే వుద్యోగం దొరికింది' అని చెప్పుతాడు వేణు.

అన్నపూర్ణ ఆనందాశ్రువులు రాల్చింది. తన తమ్ముడు ప్రయోజకుడయినందుకు

## సినిమా డైరీ

● నటి కె. ఆర్. విజయ చెల్లెలు చి. సౌ. వత్సలకు, వైద్య మంగళం రాజరత్నంకు అక్టోబరు 22న అబాట్స్‌బరీలో వివాహం జరిగింది. (వేదోక్తంగా).

● నందినీ ఫిలింస్ రెండవ చిత్రం షూటింగు అక్టోబరు 25న విజయ స్టుడియోలో ప్రారంభమైంది. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు. ఈ చిత్రానికి ఎస్. బాలనరసిరెడ్డి, జి. ఈశ్వరయ్య సహనిర్మాతలు.

● డి. బి. ఎస్. ప్రొడక్షన్స్ 'అబ్బాయిగారు—అమ్మాయిగారు' షూటింగు అక్టోబరు 19 నుండి 26 వరకు వాహినీలో జరిగింది. వి. రామచంద్రరావు దర్శకుడు.

● రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ 'దత్తపుత్రుడు' కలర్ చిత్రం షూటింగు హైద్రాబాదు సారథిలో అక్టోబరు 26న ప్రారంభమైంది. టి. ఎల్. బాబు దర్శకుడు.

● త్రిమూర్తి ప్రొడక్షన్స్ వారి కలర్ చిత్రాలను లక్ష్మీదీపక్ డైరెక్ట్ చేస్తున్నారు. కొత్త తార శుభ నాయిక.

● శశి థియేటర్స్ 'ప్రజానాయకుడు' కలర్ చిత్రం షూటింగు అక్టోబరు 20 నుండి 30 వరకు వాహినీలో జరిగింది. బాక్సాఫీస్ మధుసూదనరావు దర్శకుడు.

మనసారా దీవించింది: 'సాకు తెల్సురా. నీ ప్రశంస తప్పకుండా ఫలిస్తుందని' అని వేణును మెచ్చుకుంది 'అంతా నీ ఆశీర్వాదం అక్కా' అంటాడు వేణు. (వేణు తెచ్చిన చీర, నగలను వాణి అలంకరించుకొని, సిగ్గుతో తల వంచుకుని నిలుచుంటుంది. ఆమెను వేణు చూస్తాడు.) 'రా, ఆగావేం, ఇదేమిటి పెళ్ళి ముంచుకొచ్చింది' అంటూ ఆమె చేయి పట్టుకుంటాడు వేణు.

# సినిమా

వాణి పారిపోతుంది. 'కట్' అన్నారు దర్శకుడు జి. రామినీడు. ఈ హాస్యరసభరిత సన్నివేశం అన్నపూర్ణా కంబైన్స్ 'తల్లీ—కూతుళ్ళు' చిత్రంలో కనిపిస్తుంది. వేణుగా శోభన్, అన్నపూర్ణగా సావిత్రి, వాణిగా విజయ నటించారు. టి. క్రాంతికుమార్ ఎం. ఏ; పి. రాఘవరావు నిర్మిస్తున్న యీ చిత్రానికి చక్రవర్తి (సంగీతం), జి. కె. రాము (ఛాయాగ్రహణం) బొల్లిముంత (కలం), ఛటర్జీ (నిర్వాహం), ఆ.వి.ఎస్. దాస్ (కో–డైరెక్షన్) నిర్వహిస్తున్నారు. ప్రధాన పాత్రలను జగ్గయ్య, సావిత్రి, కాంచన, రావుగోపాలరావు, రాజబాబు, అల్లు రామలింగయ్య, నిర్మల, రమాప్రభ, వై. విజయ పోషిస్తున్నారు. నాయకుడు శోభన్‌బాబు. రిలీజ్ అన్నపూర్ణ.

## రెండవ చిత్రం ప్రారంభం

'అత్తలూ—కోడళ్ళు' చిత్రాన్ని నిర్మించిన నందినీ పిక్చర్స్ తమ రెండవ చిత్రం యొక్క షూటింగును అక్టోబరు 25 న విజయ స్టూడియోలో ప్రారంభించారు. సోమవారం ఉదయం గం. 9–05 ని.లకు నంద్యాల ప్రతాప్ టాకీస్ అధినేత రామనాధరెడ్డి స్విచ్ ఆన్ చెయ్యగా, ప్రముఖ నిర్మాత, వాహినీ స్టూడియో అధినేత నాగిరెడ్డి క్లాప్ కొట్టారు. మొదటి రోజు షూటింగులో వాణిశ్రీ, కృష్ణ పాల్గొన్నారు. అతిథులకు సహకార నిర్మాత సి. వి. రమణయ్య స్వాగతం పలికారు.

* * *

నందినీ పిక్చర్స్‌ను కె. సుబ్బిరెడ్డి, ఎస్. సుబ్బారాయుడు, జె. ఏ. రామసుబ్బయ్య కలిసి స్థాపించారు. మొదటి చిత్రమైన 'అత్తలు—కోడళ్ళు' వీరికి మంచి లాభాలను ఆర్జించి పెట్టింది. ఇప్పుడు రెండవ కానుకగా మాలతీదేవి వ్రాసిన కథను తెరకెక్కిస్తున్నారు. ఈ చిత్రానికి ఆరుద్ర, ... పాటలను, మహదేవన్ సంగీతాన్ని, సి. ఎస్. ఆర్. స్వామి (మోసగాళ్ళకు మోసగాడు ఫేమ్) ఛాయను, ఎస్. క్రిష్ణారావు కళను, ఎస్. ఎస్. ప్రకాశం గారును, పి. బ్రహ్మానందరావు సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వం నెరపుతున్న యీ చిత్రంలో వాణిశ్రీ, సూర్యకాంతం, రమాప్రభ, లీలారాణి, కృష్ణ, గుమ్మడి, కృష్ణంరాజు, రాజబాబు ముఖ్య పాత్రధారులు.

## అబ్బాయిగారు అమ్మాయిగారు

'దాగుడు మూతలు' ...

అంజలీదేవి ప్రధాన పాత్రధారులు. 'పతి అన మాయ' (బెంగాలి చిత్రాన్ని) అందించిన మధుభాయ్ పటేల్ 'గుణహీన' చిత్రానికి సారథి.

## అమెరికాలో మల్లీశ్వరి

'నిన్న, నేడు, రేపు' కూడా మరపురాని, మరువలేని మధుర కావ్యం (చిత్రం) 'మల్లీశ్వరి' అంటే మీరు కూడా ఓ. కే. అంటూ అనుకొంటూ ప్రముఖ దర్శకుడు బి. ఎన్. రెడ్డి 'మల్లీశ్వరి'ని ఎంత హృద్యమంగా తీశాడయ్యా! అనిపిస్తుంది. ఇదే మాటను న్యూయార్కులో నివసిస్తున్న తెలుగు ప్రజలు అన్నారు. ఎప్పుడో తెలుసా?

వాహినీ పిక్చర్స్ వారి 'మల్లీశ్వరి' చిత్రాన్ని ఆక్టోబరు 9న న్యూయార్కు సిటీలోని వెస్ట్ కింగ్స్ బ్రిడ్జి రోడ్, బ్రోంక్స్‌లో శ్రీనివాస ఎంటర్ ప్రైజెస్, (న్యూయార్కు) వారు ప్రదర్శించారు. అమెరికాలోను, చుట్టుపక్కల వున్న తెలుగు ప్రేక్షకులు 'మల్లీశ్వరి'ని తిలకించి విశేషంగా ప్రశంసించారు.

## చలం ప్రత్యేకత

నాగేశ్వరరావు, రామారావుల తర్వాత తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ప్రేక్షక హృదయాల్లో సంపాయించుకున్న నటుడు చలం. 'సత్తెకాలపు సత్తెయ్య, సంబరాల రాంబాబు, మట్టిలో మాణిక్యం' చిత్రాల్లోని చలం పాత్రను మనం సులువుగా మరచిపోలేము. ప్రజలు తనకిచ్చిన గౌరవాన్ని సుసమృద్ధం చేసుకునే విధంగా శ్రీరమణ చిత్రవారి 'బుల్లెమ్మ—బుల్లోడు' చిత్రంలో చలం నటించాడు. ఈ చిత్రంలో చలం ధరిస్తున్న పాత్ర చాలా విచిత్రమైనది. కథను ఆద్యంతం తనే నడిపిస్తాడు. నవరసాలంటారే — అవన్నీ నటనలో రంగరించి కథానాయకుడుగా చలం విజృంభించి అభినయించాడు. నాయికగా విజయలలిత నటించింది. దర్శకుడుగా [illegible] పరిచయం అవుతున్నాడు. సత్యం మంచి పాటలను వినిపించినట్లు, మధు కేసరా వీర విహారం సలిపినట్లు తెలుస్తుంది. ఇన్‌డోర్ షూటింగు నవంబరు మొదటి వారానికి పూర్తవుతుంది. రెండవ వారంలో చలం, విజయలలితలు కేరళకు వెళ్ళి రెండు పాటల చిత్రీకరణలో పాల్గొంటారు. ఈ చిత్రానికి రాజశ్రీ కలం కత్తిలా పదు

# బాలనటి రూప పరిచయం!

నిన్న, మొన్నటిదాకా బాలతారలుగా ఉన్న బేబి పద్మిని, బేబి రోజారమణి యిప్పుడు యువతరం పాత్రలను పోషించే వయస్సు నందుకున్నారు. ఇక పోతే ఇప్పుడు బేబి రాణి శ్రీదేవి బ్రహ్మాజీ వల పాత్రలకు ఎన్నుకోబడుతున్నారు. ఇప్పుడు మరొక బాలనటి వెండితెరకు పరిచయం అవుతూ ఉంది.

ఈ కొత్త బాలనటి పేరు రూప. పేరుకుతగ్గ రూపం ఆమె ఫోటోలో కనిపిస్తూ వుంది కదూ! ఆమె వయస్సు పది సంవత్సరాలు. ఈమెకు నటించే అవకాశాన్ని ప్రతిభా మూవీస్ వారు కల్పించారు. ఈ సంస్థ నిర్మించే



చిత్రానికి ప్రతిభావంతుడు అని పేరు. రూప తండ్రి పేరు వెంకటేశ్వరావు. వైరా అగ్రికల్చరల్ ఫారమ్‌లో రిసర్చి అసిస్టెంటుగా చేస్తున్నారు. చి॥ రూప తాతయ్య డి. కృష్ణారావు ఆంధ్ర పత్రికకు తాడేపల్లి గూడెంలో రిపోర్టరు, ఏజెంటుగా పని చేస్తున్నారు.

—శ్రీనివాస్

నుగా పని చేసిందట. డిసెంబరు 31 న విడుదల చెయ్యాలని చలం సంకల్పం, పంపిణీదారుల అభిమతం.

## తాసిల్దారుగారి అమ్మాయి

'వింటే భారతం వినాలి; తింటే గారెలు తినాలి; చూస్తే 'తాసిల్దారుగారి అమ్మాయి' చూడాలి' అనిపిస్తుంది సత్య చిత్ర వారి చిత్రాన్ని చూస్తుంటే. కావిలిపాటి విజయలక్ష్మి వ్రాసిన 'విధి విన్యాసాలు' కథను దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు అత్యంత ఆకర్షణీయంగా సెల్యులాయిడ్ పైకి ఎక్కించారు. 'ఈ చిత్రానికి నంది కళ్ళల్లో గానివ్వండి; మహదేవన్ సంగీతం గానివ్వండి; వెంకటరత్నం ఛాయాగ్రహణం గానివ్వండి' — అన్నీ పోటాపోటీగా పని చేశాయి అనిపిస్తుంది చిత్రం చూస్తుంటే.

నటీనటులు అందరూ అనుభవజ్ఞులే. జమున, నాగభూషణం, చంద్రకళ, నిర్మల —తక్కువగా నటిస్తారా? చెప్పండి! ఈ చిత్రంలో ప్రేక్షకుల అభిమానాన్ని విపరీతంగా చూరగొనే నటుడొకడున్నాడు. అతడే

## సినిమా

శోభన్‌బాబు. తండ్రి, తనయుడిగా శోభన్ నటించాడు అనడంకన్నా ఆ పాత్రలై పోయాడు అనడం వుచితం. ఒక ప్రతిభావంతుడైన దర్శకుడు (కె. ఎస్. ప్రకాశరావు) ఒక నటుడిలో దాగియున్న నటనా వైదుష్యాన్ని ఎలా ప్రస్ఫుటపరచగలడో 'తాసిల్దారుగారి అమ్మాయి' చిత్రం నిరూపిస్తుంది. ఒక మంచి నవలకు చక్కటి సినిమా ఆకృతిని కల్పించిన నిర్మాతలు సత్యనారాయణ, సూర్యనారాయణలను ఆంధ్ర ప్రేక్షకులు మనసారా అభినందిస్తారు.

## మహాత్మా సాయి భక్తి

'షిర్డీ సాయిబాబా మహాత్ముడు; ప్రవక్త; ఆయన భక్తులు అసంఖ్యాకం. దైవసమానంగా పూజింపబడే యీ మహాత్మునిపట్ల ప్రజల భక్తిని చూపించే డాక్యుమెంటరీని' ఏ. కె. ప్రసాద్ నిర్మించారు. వీరు ఆకాశవాణి న్యూస్ రీడరుగా ఆంధ్ర శ్రోతలకు పరిచితులే. సినిమారంగంలో బి. ఎన్. రెడ్డి, రామకృష్ణగార్ల వద్ద తర్ఫీదు పొందారు. ఈ డాక్యుమెంటరీకి బి. జనార్దనరావు ఛాయను, పార్థసారధి ఎడిటింగును నిర్వహించారు. అతిత్వరలో యీ భక్తి చిత్రం ఆంధ్రులకు దర్శనమిస్తుంది.

## వాంప్‌గా రాజసులోచన

తెలుగు చిత్ర రంగంలో వాంప్ పాత్రలను పోషించే తారలే లేరా? అనేడి సంశయం బయల్దేరిన తరుణంలో 'నేనువున్నాను' అంటూ రాజసులోచన వచ్చింది. రాజసులోచనకు తెలుగు తెర స్వాగతం పలికింది. హీరో కృష్ణ నిర్మించిన 'మోసగాళ్ళకు మోసగాడు' చిత్రంలో కొత్త వెండి తెర జీవితాన్ని ప్రారంభించిన రాజసులోచనకు నిర్మాత వై. వి. రావ్ 'మొనగాడొస్తున్నాడు జాగ్రత్త' లో వాంప్ పాత్ర నిచ్చారు. ఆ చిత్రంలో ఆమెనుచూసి, నిశ్చేష్టుడ్ని అయ్యాను. 'కారణం — ఆమెలో వన్నె చుదనం యింకా మిసలు కొడుతూ వుంది—అందుకే.' ఆ తర్వాత ఒక రోజున వాహినీ స్టుడియోలో రాజసులోచన్ను శ్రీ థియేటర్స్ వారి 'ప్రజానాయకుడు' సెట్స్లో చూశాను. ఆమె రూపం; లావణ్యం చూసి విస్తుపోయాను. మరింత గ్లామరస్‌గా, నాజూకుగా కనిపించింది. రెండు చిత్రాలలో ఆమెను చూసిన (నిర్మాతలు కొందరు) తర్వాత, ఆమె నటనను తాము నిర్మించబోయే చిత్రాల్లో వినియోగించుకోవడానికి నిశ్చయించినట్లు తెలుస్తుంది.

## తెలుగులో మహదేవన్ ప్రతిభ

తెలుగులో సాలుకి సగటున 50 చిత్రాలు నిర్మింపబడుతున్నాయి. వీటిలో సగం చిత్రాలకు కె. వి. మహదేవన్ సంగీత దర్శకత్వం నెరపుతున్నారు. ఒక చిత్రానికి, మరొక చిత్రానికి మహదేవన్ సంగీతంలో వైవిధ్యం ఉండడంవల్లనయితేనేమి, ఆయన పాటలకు ప్రజల ఆదరణ లభించడంవల్ల నయితేనేమి, ఆయనకు తెలుగు మార్కెట్టులో విపరీతమయిన డిమాండ్. ఇటీవల ఒకే రోజున ఆయన మూడు చిత్రాలకు మూడు రకాల పాటలను రికార్డు చేశారు. మూడూ 'హిట్' అయ్యే పాటల్లాగా నాకు అనిపించింది. అందుకే మహదేవన్‌కు మంచి గిరాకీ!

—శ్రీనివాస్

nted and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty 'et, Madras-1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3

# ಅಅಅ ಹ ಚ್!











ప్రతి స్త్రీ మూర్తి చూసి గర్వించతగిన
ఆదర్శ స్త్రీ మూర్తి కరుణామయ గాథ!



రామ విజేతా ఫిలింస్

# రామాలయం

స్క్రీన్‌ప్లే - దర్శకత్వం
కె. బాబూరావు

నిర్మాత
కె. ఏ. ప్రభాకర్

ఆంధ్ర: జ్యోతీ సీడెడ్: నవభారత్ నైజాం: ఉషా
మైసూర్: విజయా

SUVARNA